# కొత్తపల్లి

## తెలుగు పిల్లల ఈ (e) మాస పత్రిక

**సంచిక:6** **సెప్టెంబరు 2010** **సంపుటి: 3**

**( http://kottapalli.in లోని e - సంచికకు పుస్తక రూపం )**

## ఈ సంచికలో. . . .

**ముందు మాట**



ధారావాహికలు:



**పిల్లలు చెప్పిన కథలు:**



**పెద్దలు చెప్పిన కథలు:**



**అనువాద కథలు:**



**పాటలు:**



**బొమ్మకు కథ రాయండి:**



నెమలీ నెమలీ





తాత బాధ

ఐస్‌క్రీం చల్లన!



ఈ మాసపు ముఖచిత్రం
"గిజుభాయి బడేకా"




# సుబ్బయ్యమాస్టారు

చిన్నపల్లిలో సుబ్బయ్యమాస్టారంటే తెలీని వాళ్ళు లేరు.

తెల్లని ధోవతి, ఎర్రంచు కండువాతో ఆయన రోడ్డు వెంబడి నడుస్తుంటే, ఊరు ఊరంతా తెల్లగా మెరిసిపోయినట్లుండేది.

మాస్టారుకొక కొడుకు.

కొడుకు కూడా మా బళ్ళోనే చదువుకునేవాడు.

వాడూ, నేనూ పోటీ పడి చదివేవాళ్లం. ఎప్పుడూ వాడికంటే ఒక మార్కు ఎక్కువే వచ్చేది నాకు. అలాంటిది, ఐదవ తరగతి మెయిన్ పరీక్షకు వచ్చేసరికి, నాకంటే వాడికి ఎనిమిది మార్కులు ఎక్కువొచ్చాయి.

నేను రోజంతా ఏడుస్తూ మూలన కూర్చున్నాను.

సుబ్బయ్య మాస్టారు కొడుకు పట్ల దురభిమానం ప్రదర్శించాడని, లేకపోతే నాకే ఎక్కువ మార్కులు వచ్చి ఉండేవని ఏడ్చాను. సుబ్బయ్య మాస్టారికి పక్షపాత బుద్ధి ఉందన్నాను- తన కొడుకంటే ఆయనకు విపరీతమైన ప్రేమ అని, వాడికంటే బాగా చదివే పిల్లలంటే కుళ్ళు అని- ఏవేవో అన్నాను.

నేనన్నవన్నీ సుబ్బయ్యమాస్టారికి చేరాయేమో-

మరునాడు మాస్టారు నన్ను పిలిచారు వాళ్ళింటికి.

నేను వెళ్ళే సరికి సుబ్బయ్య మాస్టారు మొక్కలకు నీళ్లు పోస్తున్నారు. ఇంట్లో చాలా పూల మొక్కలు ఉన్నాయి. ఇంటి గోడకు ఆనుకొనే ఒక వేప మొక్క పెరుగుతున్నది. ఇంటి బయట, ఎదురుగా, రోడ్డుకు అవతలివైపున- ఇంకో వేప మొక్క ఉన్నది. మాస్టారు ఆ చెట్టుకు కూడా నీళ్లు పోసి, నన్ను అడిగారు- "ఒరే, ఈ లోపలి మొక్కను, ఆ బయటి మొక్కను నేను ఒకేసారి నాటాను. కానీ ఇదేదో ఒకలాగా పెరిగింది, అది ఇంకోలాగా పెరిగింది- ఎందుకో?" అన్నారు. ఇంట్లో మొక్క నిటారుగా పెరుగుతోంది. బయటి మొక్క మీద పశువులు దాడి చేసినట్లున్నాయి, పొడుగ్గా కాకుండా కొమ్మలు కొమ్మలుగా పెరిగి ఉన్నదది.

"రోడ్డు మీది పశువులన్నీ దీన్ని కొరికినట్లున్నాయండీ" అన్నాను నేను.



"కానీ నేనైతే వీటన్నిటికీ ఒకే ప్రేమను పంచానురా. ఒకే లాగా నీళ్లు పోశాను. ఇంటి లోపల ఉన్న చెట్లనూ, బయట ఉన్న వాటినీ ఒకే లాగా చూసుకున్నాను. ఆ వేప చెట్టు ఏమనుకుంటోందో ఏమో మరి, నాగురించి!" అన్నారు సుబ్బయ్య మాస్టారు.

నేను ఏమీ మాట్లాడలేదు.

"ఇంట్లో కూడా, రకరకాల చెట్లు పెంచానురా. ఏ చెట్టు ఎత్తు దానిదే. కొన్నేమో పూలిస్తాయి, కొన్ని కాయలు కాస్తాయి, కొన్ని పండ్లిస్తాయి, కొన్ని కేవలం నీడనిస్తాయి. దేని ప్రత్యేకత దానిదే. దేన్ని చూసినా నాకు సంతోషం వేస్తుంది. ఇవన్నీ నా శ్రమవల్ల ప్రాణం పోసుకున్నవే. 'ఇన్ని రకాల మొక్కలు, చెట్లు నావల్ల ఎదిగాయీ అనే సంతోషం చాలా బాగుంటుంది- కదూ?" అన్నారాయన.

"అవునండీ" అన్నాను నేను, తలవాల్చుకొని.

ఆ తర్వాత నేను ఎప్పుడూ మార్కులకోసం వెంపర్లాడలేదు. నాకు తక్కువ మార్కులు వేసి అన్యాయం చేశారని ఎవ్వరినీ నిందించలేదు. తక్కువ మార్కులొచ్చిన వాళ్ళని చిన్నచూపు చూడలేదు. ఎక్కువ మార్కులు వచ్చిన వాళ్లని కొండెక్కించి చూడనూ లేదు-

"దేని ప్రత్యేకత దానిదే" అన్న సుబ్బయ్య మాస్టారి మాటలు ఈనాటికీ గుర్తున్నాయి నాకు.

ఈ సంగతి చెబుతున్న రవి కళ్ళలో సుబ్బయ్య మాస్టారు తళుక్కున మెరిశారు.

పిల్లలకు మానవీయమైన చదువులు అందించాలనీ, అర్థవంతమైన చదువుల వల్లనే పిల్లలు సంపూర్ణ వ్యక్తులుగా ఎదగగల్గుతారనీ తపనపడే గురువులందరికీ నమస్కరిస్తూ, ఆ స్ఫూర్తికి దీపస్థంభమై నిలచిన గిజుభాయి బడేకాను ఈ మాసం గురుపూజోత్సవ సందర్భంగా స్మరించుకుంటూ-

మీకందరికీ అభినందనలతో-

కొత్తపల్లి బృందం

కొత్తపల్లి పత్రిక పిడియఫ్ లుగా మాత్రమే కాక ఇప్పుడు ఆన్‌లైను లో పుస్తకంలా చదువుకునే "బుక్ రీడర్" ఫార్మాటులోను, ఇ-పబ్ ఫార్మాటులోను, కిండిల్, డైసీ, డిజెవు ఫార్మాటుల్లోను, ఫుల్ టెక్స్టు రూపంలో కూడాను- ఉచితంగా లభిస్తుంది. పత్రికను ఆర్కైవ్ డాట్ ఆర్గ్‌కు అప్లోడు చేయటం వల్ల ఈ సౌకర్యం ఏర్పడింది. ఇంటర్నెట్ సౌకర్యం ఉన్న చదువరులు ఒకసారి http://kottapalli.in/2010/09/download ని సందర్శించి చూడండి. ఈ సౌకర్యం/అసౌకర్యం పట్ల మీ అభిప్రాయాలను తప్పక తెలియజేయండి.



# నీతిచంద్రిక

**11 వ భాగం**

*మూలరచన: కీ.శే.పరవస్తు చిన్నయసూరి* *సరళీకరణ: ఘడియారం వేంకట నారాయణ శర్మ.*

*జరిగిన కథ: సంజీవకం దిక్కులు పిక్కటిల్లేలా రంకె వేయగానే, సింహం కూడా నిశ్చేష్టమై నిలబడిపోతుంది. కరటకం, దమనకం అనే నక్కలు మాత్రం, కొంచెంసేపు ఆలోచించి, ఆ ధ్వని ఏమిటో గుర్తుపడతాయి. వెళ్లి ఆ సంగతిని సింహానికి చెబుదామంటుంది దమనకం. 'తనకు మాలిన పని చేయకూడదు' అంటూ కరటకం 'మేకును పెరికిన కోతి' కథను, 'కుక్క-గాడిద' కథను చెబుతుంది దానికి. "మాంసం చాలా ఉంది- తిందాం పద" అంటుంది. ఇక చదవండి, 11 వ భాగం...*

అప్పుడు దమనకుడు అన్నది: "చూడు, ఇప్పుడు తొందరెందుకు? తినేది ఎప్పుడైనా తినచ్చు. ఆహారం, నిద్ర, భయం- ఇవి అన్ని జంతువులకూ సహజంగా ఉండే ధర్మాలే. పొట్ట నింపుకుందామని చూస్తుంటే గౌరవం దక్కదు. తెలివైనవాళ్ళు రాజుగారి ప్రాపకం కోరుకునేది 'స్నేహితులకు ఉపకారమూ- శత్రువులకు అపకారమూ' చేసేందుకే ! తన ఒక్కడి పొట్ట

పోసుకోవటం ఏమాత్రపు పని? ఎలాంటివాడు జీవించటం వల్ల అనేక మంది జీవించటం సాధ్యపడుతుందో, అలాంటివాడి బ్రతుకే బ్రతుకు. నిజానికి వాడొక్కడినే 'జీవిస్తున్నాడు' అనాలి.



మాంసం ఏమాత్రం లేకపోయినా, మురిగిపోయిన క్రొవ్వుతో కంపు కొడుతున్నాసరే- ఎముక దొరికందంటే చాలు- కుక్క అమితంగా సంతోషపడుతుంది- కానీ ఆ ఎముకతో 'తన ఆకలి ఏమాత్రమూ తగ్గదు కదా' అని గుర్తించదు. కానీ సింహం?- దగ్గరలోనే ఉన్నవైనా సరే- బక్కచిక్కిన జంతువుల్ని ఆశించక, తన సొంత పంజాలోని వాడి గోళ్ల చేత చీల్చబడిన ఏనుగు తలలోని మెదడును కోరుకుంటుంది. ప్రతివాళ్ళూ తమ తమ శక్తికి తగిన ఆహారాన్నే కోరుకుంటుంటారు. కుక్క తనకు ఇంత ముద్ద పడేసేవాడి దగ్గర నిలబడి తోక ఆడిస్తుంది; నేలమీద పడి కడుపును చూపిస్తుంది. ఇన్ని పాట్లు పడ్డా దానికి ఒక్క ముద్దను మించి పెట్టరు. అదే, రెండు దంతాలు కలిగిన ఏనుగు? -గంభీరంగా చూస్తూ, మావటివాడు 'తిను తిను' అని మాటి మాటికీ బుజ్జగిస్తుంటే, మెల్లగా తనకు కావలసినంత తింటుంది. తక్కువవాడు ఎంత దీనంగా వేడుకున్నా సరే, వాడికి తనివి తీరేట్లు ఎవ్వరూ ఏమీ పెట్టరు. అదే, మర్యాదస్తుడికైతే, వినయంగా మాట్లాడుతూ, కోరికను మించి ఇస్తారు. మచ్చలేని విద్యచేతగాని, తిరుగులేని శౌర్యము చేతగాని, లేదా అపాయం లేని ఉపాయం చేతగాని- ఏదో ఒక విధంగా రాజుల్ని మెప్పించిన వాడి బ్రతుకే బ్రతుకు. ఏదో ఇంత అన్నం తిని కుక్క మాత్రం బ్రతికిపోవట్లేదా? తన గౌరవాన్ని నిలుపు-కుంటూ, ఉన్నంతలో ఇతరులకు మేలు చేసేవాడు ఒక్కరోజు బ్రతికినా చాలుగాని, తన కడుపునొక్కదాన్నీ నింపుకునేందుకు చూసే

కాకి చిరకాలం బ్రతికి మాత్రం ప్రయోజనమేమున్నది? కొంచెం వాన పడినవెంటనే రాతినేలలో ప్రవాహం బయలుదేరినట్లు, కొంచెం లాభం రాగానే తక్కువవాడిలో అమితమైన సంతోషం తలెత్తుతుంది. ఏది మంచిదో, ఏది చెడ్డదో తెలీక, చేయవలసిన పనులను వదిలి తన కడుపు మాత్రం నింపుకోవాలనుకునేవాడు జంతువుతో సమానం. అంతేకాదు- నిజంగా చూస్తే అలాంటి నరపశువుకంటే, బరువులు మోసుకుంటూ, గడ్డి పరకలు మేస్తూ, వ్యవసాయం మొదలైన వృత్తులకు అత్యంత సేవ చేస్తూ, పవిత్రపు పుట్టుక పుట్టిన ఎద్దే, చాలా నయం" అని.

ఆ మాటలు విని కరటకం - " దమనకా! మనం మంత్రులం కాము. ఇంత ఆలోచించనక్కర్లేదు- దాని వల్ల మనకేమి లాభం?" అన్నది.

అప్పుడు దమనకం అన్నది- "మంత్రి అయ్యేందుకు ఎంత సేపు పడుతుంది? గతంలో చేసుకున్న పుణ్యం వల్ల తెలివితేటలు, జ్ఞానం లభిస్తాయి. అలా జ్ఞాని అయిన పండితుడు, ప్రభువుల మెప్పు పొందుతాడు. అలా ప్రభువుల మెప్పు లభించటం వల్ల పాండిత్యం మరింత వెలుగు చూస్తుంది. దానివల్ల తనరాజ్యాన్నేగాక, ఇతర రాజ్యాలను కూడా నడిపేంత సామర్ధ్యం వస్తుంది. ఆ సామర్ధ్యం వల్ల మంత్రికి ఇంకా ఎక్కువ ఆదరం లభిస్తుంది.

పెట్టెలోపల ఉన్న రత్నం కూడా, సూర్యుడి కాంతి చూడకనే ప్రకాశించదు- పండితుడు కూడా అంతే. మనిషన్నవాడికి మంచి నడవడి ఉన్నట్లైతే అన్నిలోకాలకూ పూజనీయుడౌతాడు. లేనట్లైతే నిందల పాలౌతాడు. గౌరవంగాని, అగౌరవంగాని నడవడిని బట్టే లభిస్తుంటాయి. మంచివాడు అని పేరు పొందటం కష్టం- చెడ్డవాడు అని పేరుపొందటం అతి సులభం. పెద్ద బండరాతిని కొండమీదికి ఎక్కించటం చాలా కష్టం- కానీ దాన్ని క్రిందికి త్రోయటం ఏమంత పెద్దపని కాదు గదా?" అని.

ఆ మాటలు విని కరటకం- "రాజుగారి ప్రాపకం ఎంత లాభమో తెలీనివాడిని కాదుగానీ-

గతంలో ఇతని వల్ల పడ్డ పాట్లు తలచుకుంటే చాలు- నాకు తలనొప్పి వస్తున్నది: అందుకనే ఇట్లా అన్నాను. సేవకుల మంచి చెడులను పట్టించుకోని రాజును ఆశ్రయించి ఉండటం చాలా కష్టం. నువ్వు తెలివైనవాడివి- ఇతరులచేత చెప్పించుకోవలసిన అవసరం నీకు ఏమాత్రమూ లేదు. నీకు ఎలా తోస్తే అలా చెయ్యి. ఇంతకూ ఇప్పుడు నీకు ఏంచేద్దామనిపిస్తున్నది?" అని అడిగింది.



అప్పుడు కరటకం సంతోషించి, " మనరాజు పింగళకుడు నీళ్ళు త్రాగేందుకని కాళిందీ నదికి పోబోయాడు- అయితే అంతలోనే ఎద్దు రంకె విని, భయపడి, ఒడ్డు దిగేది కూడా మరచిపోయి, అలాగే నిశ్చేష్టుడై నిలబడిపోయి ఉన్నాడు.

'ఇతరుల మనసులోని సంగతులు ఎవ్వరికీ కనబడవు; మరి అతని మనస్సులో ఏమున్నదో నీకు ఎట్లా తెలిసింది?!" అనకు. అతను నిలబడిపోయిన తీరును చూస్తే, ఈమాత్రం సంగతి చాలా స్పష్టంగా అర్థమవుతున్నది నాకు. తెలివిగలవాళ్లకు ఇతరుల భావనల్ని కనుక్కోవటం కష్టం కాదు. గుర్రం, ఏనుగు మొదలైన జంతువులు కూడా యజమానుల మనసుల్ని గ్రహించి, తమ విధుల్ని నిర్వర్తిస్తుంటాయి. ఇతరుల మనస్సులలోని అభిప్రాయాలను తెలుసుకొనటం ఒక్కటే పండితుని బుద్ధిలోని ప్రత్యేకత. ఆ భేదమే లేదంటే, ఇక పండితునికి-పామరునికి తేడా ఏముంటుంది?

అది అటుంచు- ఇప్పుడు చేయవలసిన పని గురించి చూద్దాం. నేనిప్పుడు రాజు దగ్గరికి పోతాను. ఆయన మనసులోని భావనకు అనుగుణంగా వ్యవహరిస్తాను. దానికి తగినట్లుగా మాట్లాడతాను. "ఈ పనిని నువ్వే చెయ్యి" అని ఆయనే స్వయంగా నన్ను ఆజ్ఞాపించేటట్లు చేస్తాను. ఆయన మనసుకు

నచ్చినట్లుగా ప్రవర్తించి, ఆయన మెప్పు సంపాదిస్తాను" అన్నది.

అప్పుడు కరటకం " రాజుగారి కొలువు కోరేవాళ్ళు మెలకువతో ప్రవర్తించాలి. వాళ్ల మనస్సులెట్లా మారుతూ ఉంటాయో తెలుసుకొని, వాటికి తగినట్లు ప్రవర్తించటం చాలా కష్టం. స్వతంత్ర వృత్తి లాంటిది కాదు, ఆ పని. జాగ్రత్తగా ఉండాలి" అన్నది.

కరటకం మాటలకు దమనకం అన్నది: " ఉద్యోగికి దూర ప్రదేశమంటూ లేదు; పండితుడికి పరదేశం అంటూ లేదు; ఇష్టంగా మాట్లాడేవాడికి శత్రువనేవాడు లేడు- అలాగే తెలివిగలవాడికి అసాధ్యం అనేదే లేదు. మంచి ప్రవర్తన కలిగి, ఎల్లప్పుడూ తమను కొలిచేవాళ్లను రాజులు ఆదరిస్తారు. యజమాని కోపాన్ని-దయను కనుక్కొని, ఆ గుర్తులకు అనుగుణంగా మసలుకొనే సేవకుడంటే యజమానికి ఇష్టం పుడుతుంది" అని.

"ముందుగా రాజును గమనించుకొని ఆయనకు తగినట్లుగానే మాట్లాడాలంటే, ఇక మాట్లాడటంలో అర్థం ఏముంటుంది?" అన్నది కరటకం, కొంచెం తిరస్కారంగా.

అప్పుడు దమనకం " 'ఈ విధంగానే' మాట్లాడాలని నియమం ఏమీ లేదు కదా? ప్రతిభ కలవాడు సమయోచితంగా- యజమానిముందు- పలుకవలసిన మాటలు అనేక విధాలుగా ఉంటాయి. సేవకుడు అనేవాడు 'అణకువకు ప్రతిరూపమా' అన్నట్లు, యజమానికి ఎట్ట ఎదురు స్థానంలో నిలువక, ప్రక్కకు తొలిగి నిలబడి, యజమాని తనవైపుకు చూస్తున్నపుడు, ఆ సమయానికి అనుగుణంగా ముందు వెనుకలు చూసుకొని, యజమాని మనస్సులోని భావాన్ని ఊహించి, ఆయనకుగాని, ఆయనకు ఇష్టులైనవారికి గాని వ్యతిరేకంగా కాకుండా, నేర్పుగా తను చెప్పదలచిన విషయాన్ని చెప్పాలి." అన్నది.

అదివిని కరటకం "నువ్వు తలపెట్టిన పని నెరవేరాలని ఆశిస్తున్నాను. అదిగో, చూడు! రాజు వెనక్కి తిరిగి ఇంటికి పోతున్నాడు. ఆయన తన ఇంటికి చేరుకునేసరికి నువ్వు కూడా పోయి ఆయనను కలుసుకోవచ్చు. పో,

ఇక" అన్నది.



వెంటనే దమనకుడు పింగళకుడి దగ్గరికి పోయి, చాలా అణకువతో ఒదిగి నిల్చొని, భయభక్తులు ఉట్టిపడేటట్లు కంగారు పడుతూ, నమస్కారం చేసింది. ఆ సింహరాజు అప్పుడు దానిని గౌరవం నిండిన చూపులతో ఆహ్వానించి, కూర్చొనమని, "బాగున్నావా? చాలా కాలమైంది, నిన్ను చూసి!" అన్నది.

అప్పుడు తెలివైన ఆ నక్క దమనకం ఇట్లా అన్నది:

(-తరువాయి వచ్చే మాసం.......)

జోకు

## పిచ్చి జోకు

ఒక ఊరిలో ఇద్దరు భార్యాభర్తలున్నారు. భార్యపేరు 'మెదడు' ; భర్తపేరు 'ఏమిటి.'

ఒక సారి జనాభా లెక్కల వాళ్ళు వచ్చారు.

జ.లె. : మీ పేరు ఏమిటి?

భర్త: నా పేరు ఏమిటి.

జ.లె. (చికాకుగా): మీ మెదడు ఎక్కడుంది?

భర్త: మా మెదడు స్నానం చేస్తున్నది.




# గ్రంథాలయం

*రచన: P. భాగ్యలక్ష్మి, 9 వ తరగతి, ప్రకృతిబడి, చెన్నేకొత్తపల్లి.*



కొత్తపల్లి జమీందారు కు ఒక సమస్య వచ్చి పడింది. ఇన్నేళ్ళుగా ఆయన అనేక పుస్తకాలు సేకరించి, అద్భుతమైన గ్రంథాలయం ఒకటి స్థాపించారు. ఆ గ్రంథాలయాన్ని ఇంత-కాలమూ సమర్థవంతంగా నడిపిన అలివేలమ్మ, ఇప్పుడు ముసలిదైంది. ఇంత పెద్ద లైబ్రరీని నడిపేందుకు ఆమెకు ఇప్పుడు శక్తి చాలటం లేదు. "ఆమె పదవీ విరమణ చేస్తే, ఇక గ్రంథాలయానికి దిక్కెవ్వరు?" అని జమీందారుగారు చాలా మథన పడి, చివరికి 'వేరే ఎవరినైనా పనిలోకి తీసుకుంటే తప్ప, లాభం లేదు" అని నిశ్చయించారు.

తన ప్రకటనకు బదులిచ్చిన అనేకమందిని విచారించి, రాముడు, సోముడు, భీముడు, వీరుడు అనే నలుగుర్ని 'అందరిలోకీ ఉత్తములు' అని తేల్చారాయన. అయితే వీళ్ళలో సరైనవారెవ్వరో తేల్చటం ఆయన వల్ల కాలేదు. తెలివితేటల్లో గాని, నీతి నిజాయితీల్లో

గాని వీళ్ళు నలుగురూ సమానంగానే ఉన్నట్లున్నారు!

అందుకని ఆయన సరైన అభ్యర్థిని ఎంపిక చేసుకునే బాధ్యతను అలివేలమ్మకే అప్పజెప్పాడు.

అలివేలమ్మ లైబ్రరీలోంచి తనకు నచ్చిన పాత పుస్తకం ఒకదానివి, నాలుగు ప్రతులు బయటికి తీసి పెట్టింది. అభ్యర్థులు నలుగురికీ తలకొక ప్రతినీ అందించి, ఆమె- "మీకు రెండు రోజుల సమయం ఇస్తున్నాను. ఈ రెండు రోజులూ మీరు ఇక్కడికి దగ్గర్లోనే, జమీందారు గారి బంగళాలో ఉండచ్చు. మూడవ రోజున మీకు ఒక పరీక్ష పెడతాను. ఆ పరీక్ష ఫలితాన్ని బట్టి, ఈ పనికి మీలో తగిన వారెవరో తెలుస్తుంది. బాగా శ్రద్ధగా చదవండి, మరి" అన్నది.

ఆ రోజు సాయంత్రానికల్లా రాముడు వచ్చి, అలివేలమ్మ ముందు కూర్చున్నాడు. "నేను పుస్తకాల్ని చాలా వేగంగా చదవగలను. మీరిచ్చిన ఈపుస్తకాన్ని కూడాను, చదివేశాను. మీరు పరీక్ష పెట్టటం కోసం మూడు రోజులు ఆగవలసిన పనిలేదు. ఆ ప్రశ్నపత్రం ఏదో ఇచ్చేస్తే, నేను ఇప్పుడే పరీక్ష రాసేసి చక్కా పోతాను. సమయం వృధా చేసేదెందుకు?" అన్నాడు. అలివేలమ్మ కొంచెం ఆలోచించి, అతనికొక్కడికే ప్రశ్నపత్రం ఇచ్చింది. అతను త్వర త్వరగా జవాబులు వ్రాసి ఇచ్చి, వెళ్ళి వస్తానని శలవుకోరి, వెళ్ళిపోయాడు.

మరునాడు తెల్లవారాక, భీముడు, వీరుడు గ్రంథాలయానికి వచ్చి కూర్చున్నారు. "సోముడేడి?" అని అడిగింది అలివేలమ్మ. "అతను అక్కడే కూర్చొని చదువుతున్నాడు. మీరడిగే ప్రశ్నలు ఎంత కఠినంగా ఉంటాయోనని, పుస్తకాన్ని మొత్తం రుబ్బేస్తున్నాడు" అన్నారిద్దరూ. "మరి మీరెందుకు వచ్చారు?" అన్నది అలివేలమ్మ. ఇద్దరూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. తేలిందేమంటే, భీముడికి పుస్తకాలు పాతబడితే ఇష్టం లేదు! "మీ దగ్గర ఈ పుస్తకం ప్రతి బాగా పాతబడింది. చదివేందుకు అనువుగా లేదు. కొత్త ప్రతి ఏదైనా ఉంటే ఇవ్వండి" అన్నాడు భీముడు. అలివేలమ్మ నవ్వి, తన దగ్గరున్న కొత్త ప్రతి ఇవ్వగానే, అతను

దాన్ని అందుకొని, వసతి గృహం వైపుకు బయలుదేరాడు.



"నీకు కూడా కొత్త పుస్తకమే కావాలా?" అడిగింది అలివేలమ్మ, అక్కడే కూర్చొని పుస్తకాలన్నిటినీ పరిశీలిస్తున్న వీరుడితో. "లేదులెండి, అంత అవసరం లేదు- నేను కొంచెం సేపు ఇక్కడ కూర్చొని వెళ్తాను" అన్నాడు వీరుడు. ఆరోజున అతను అక్కడే కూర్చొని, గ్రంథాలయంలో ఉన్న పుస్తకాలు చాలావాటిని తిరగేస్తూ గడిపాడు. "నీకు ఇచ్చిన పుస్తకం చదువుకో, మళ్ళీ పరీక్ష పెట్టినప్పుడు జవాబులు రాకపోతే ఎలాగ?" అన్న అలివేలమ్మకు అతని చిరునవ్వే సమాధానమైంది.

మరునాడు అలివేలమ్మ పరీక్ష పెట్టింది. జవాబులను దిద్దిచూస్తే, రాముడికీ, సోముడికీ నూటికి 92 మార్కులొచ్చాయి. భీముడికి 95, వీరుడికి అందరికంటే తక్కువ- 90 మార్కులు వచ్చాయి.

అలివేలమ్మను అడిగి సంగతంతా తెలుసుకున్న జమీందారుగారు నవ్వి, "ఉద్యోగాన్ని ఎవరికిద్దామంటారు, వీరుడికే ఇద్దాం, మరి?" అన్నారు.

అలివేలమ్మకూడా నవ్వి "నా ఎంపికా అదే!" అన్నది.

అక్కడే కూర్చొని అంతా చూస్తున్న పిల్లి, 'తక్కువ మార్కులు వచ్చినా ఉద్యోగం వీరుడికే ఎందుకిస్తున్నార'న్నట్లు, "మ్యావ్"మన్నది.




# తాత బాధ

చిట్టి కథ

*సేకరణ, కథనం: M.చంద్రశేఖర్, 10 వ తరగతి, ప్రకృతిబడి, చెన్నేకొత్తపల్లి.*

పిల్లలూ! నా బాధ ఏంటో చెబుతాను వినండి.

నా పేరు రాము. నేను మీ అంత వయసులో ఉన్నప్పుడు, చదువుకన్నా నాకు దేవుని మీద భక్తే ఎక్కువ ఉండేది. అందుకని, నేను ప్రతిరోజూ బడికి వెళ్ళేటప్పుడు దేవాలయం దగ్గర ఆగి, దేవునికి మొక్కుకొని గానీ ముందుకు వెళ్లేవాడిని కాదు.

ఒకసారి ఏమైందంటే, బడి వదిలిన తర్వాత నేను మా ఊరికి వెళ్తున్నాను గదా, అప్పుడు ఉన్నట్టుండి పెద్ద గాలి వీచింది. 'ఏమిటా?' అని నేను ఆగి చూశాను. తర్వాత నేను రోజూ కొలిచే దేవుడే నాముందు ప్రత్యక్షం అయ్యాడు! నేను చాలా ఆశ్చర్యపోయాను. దేవుడు అప్పుడు నాముందు నిలబడి, ఉరుముతున్నట్లు అన్నాడు- "నువ్వు రోజూ నన్ను కొలుస్తున్నావు గదా, అందుకని నాకు నీమీద కరుణ కలిగింది. నీకు ఒక వరం ఇస్తున్నాను- కోరుకో, ఏం

కావాలో" అని.

చిన్న పిల్లవాడిని కదా, అందుకని తక్షణమే నాకు ఒక చిలిపి ఆలోచన వచ్చింది. నేను అడిగాను- "స్వామీ! 'మీ లోకంలో ఒక సెకన్ అంటే మాలాంటి మనుష్యులందరికీ పదివేల సంవత్సరాలు' అని మా అయ్యవారు చెప్పారు, నిజమేనా?" అని.

"అవును, నిజమే" అన్నాడు దేవుడు.

"మరి, మీ లోకంలో ఒక రూపాయి అంటే మాలోకంలో 100 కోట్ల రూపాయలట, నిజమేనా స్వామీ?" అడిగాను నేను.

"అవునవును, నిజమే" ఒప్పుకున్నాడు దేవుడు.

"మరయితే నాకు మీ రూపాయి ఒకటి ఇవ్వండి స్వామీ" అన్నాను నేను, నా తెలివికి నేనే మురిసిపోతూ.

అప్పుడు దేవుడు "ఒక్క సెకన్ ఆగు- ఇస్తాను" అని వెళ్లిపోయాడు!

ఇప్పుడు నాకు 90 సంవత్సరాలు- దేవుడి సెకను ఇంకా పూర్తికాలేదో, ఏమో- ఆయనా రాలేదు, ఆయన రూపాయీ రాలేదు నాకు!

**ప్రశ్న-జవాబు** జోకు

నాన్న: రాముూ, పరీక్షలు బాగా రాశావా?

రాము: ప్రశ్నలన్నీ చాలా సులభంగా వచ్చాయి నాన్నా, అన్నీ రాసేశాను!

నాన్న: మరింకేమిరా, నూటికి తొంభై అయినా వస్తాయిలే

రాము: కష్టమే నాన్నా, ఊరికే పాసు మార్కులు రావచ్చంతే.

నాన్న: అన్నీ రాశానన్నావు గదరా?

రాము: ప్రశ్నలన్నీ రాసేశాను నాన్నా, జవాబులే, కష్టం అనిపించాయి!

.



# డింగో రాజ్యం-బూర రాజ్యం

*మూల రచన: V. అశోక్, 7 వ తరగతి, రిషివ్యాలీ రూరల్ స్కూల్, మదనపల్లి.*

అనగా అనగా రెండు రాజ్యాలుండేవి- డింగో రాజ్యం, బూర రాజ్యం. డింగో రాజ్యపు రాజు మురారి, బూర రాజ్యపు రాజు అరవిందస్వామి. మురారి, అరవింద స్వామి ఇద్దరూ మంచి మిత్రులు అవ్వటంతో రెండు రాజ్యాలూ ఎలాంటి తగాదాలు లేకుండా కలసి మెలసి ఉండేవి. రెండు రాజ్యాల ప్రజలూ ఎలాంటి పొరపొచ్చాలూ లేకుండా మిత్రభావంతో మెలగేవారు.

ఇలా ఉండగా ఒక సారి బూర రాజ్యపు రాజు తన దేశంలో ఒక గొప్ప కోవెల కట్టించాలని తలపెట్టాడు. గుడికి విశాలమైన ప్రాంగణం, ముందు పెద్ద కోనేరు, ప్రపంచంలోనే కనీ విననంత పెద్ద గాలిగోపురం- ఇలాంటి ప్రణాలికలతో ఒక గొప్ప గుడి నిర్మాణం మొదలైంది. అయితే పని ప్రారంభం

అయిననాడే ఒక అద్భుతం జరిగింది: పంచలోహాలతో చేసిన వేణుగోపాల స్వామి విగ్రహం ఒకటి, బయటపడింది!

కొన్ని వందల సంవత్సరాల క్రితం డింగో రాజ్యమూ, బూర రాజ్యమూ కలిసి ఒకే 'డింగోబూర' రాజ్యంగా ఉండేవి. వేణు గోపాల స్వామి చలవ వల్ల డింగో బూర రాజ్యంలో అంతా సుభిక్షంగా ఉండేది. కానీ ఏనాడైతే స్వామి ఆలయం పడిపోయిందో, ఆ సంవత్సరమే రాజ్యం రెండు ముక్కలైంది; వానలు కురవక, కరువు ఏర్పడింది; అందరికీ కష్టాలు, నష్టాలు మొదలయ్యాయి. ఆ తరపు రాజులు ఎంత వెతికినా మళ్ళీ వేణుగోపాల స్వామి విగ్రహం దొరకనే లేదు!

మళ్ళీ ఇన్నేళ్ళకు, తనకే విగ్రహం దొరికినందుకు అరవింద స్వామి ఎంతో సంతోష పడ్డాడు. స్వామి కోవెల పూర్తైతే మళ్ళీ తమ రాజ్యానికి పూర్వ వైభవం వస్తుంది! అందుకని, ఆయన కోవెల పనులు త్వరగా పూర్తిచేయమని ఆదేశాలు జారీ చేశాడు.

అయితే, అక్కడే ఉన్న డింగో రాజ్యపు గూఢచారి ఈ విషయాన్ని తక్షణమే తమ రాజు మురారికి చేరవేశాడు. "వేణుగోపాల స్వామి విగ్రహం ఏ రాజ్యంలో ఉంటే ఆ రాజ్యం మొత్తం ఐశ్వర్యంతో నిండి ఉంటుంది.. మరి ఆ వైభవం బూర రాజ్యానికే ఎందుకు దక్కాలి; తాము వారికి ఎందులో తీసిపోయాము? మా ఇలవేల్పు ఆ స్వామే- కనుక, విగ్రహం మాకే దక్కాలి" అని డింగో రాజు, సభికులు తీర్మానించారు. దాని ప్రకారమే మురారి అరవింద స్వామికి కబురు పంపాడు: "మీరు ఆ విగ్రహాన్ని మాకు ఇవ్వండి. దానికి తగిన డబ్బు చెల్లిస్తాం" అని.

అరవింద స్వామి, బూర రాజ్యపు మంత్రులూ ఇందుకు ఒప్పుకోలేదు. "మేం ఇవ్వం" అని కబురు పంపారు- "విగ్రహం మా రాజ్యంలోనే దొరికింది కాబట్టి, అది మాకే చెందుతుంది" అని.

మాటలు చిలికి చిలికి గాలివాన అయ్యాయి. డింగో రాజ్యం వారు బూర రాజ్యం మీద పూర్తి స్థాయి యుద్ధం ప్రకటించేశారు. రెండు రాజ్యాలూ ఘోరంగా పోరాటం చేశాయి. ఆ

యుద్ధం జరిగే చోట రక్తం ఏరులై పారింది. ఇరుపక్షాల్లోనూ వేలమంది సైనికులు, సామాన్య ప్రజలు ప్రాణాలు కోల్పోయారు. అయినా విజయం ఇద్దరిలో ఎవరినీ వరించలేదు- ఇంకా చాలా ధననష్టం, ప్రాణ నష్టం జరిగితే తప్ప, యుద్ధం ముగిసేట్లు లేదు.



గుడారంలో చికాకుగా అటూ ఇటూ తిరుగుతున్న అరవింద స్వామికి, దూరంగా ఇద్దరు పిల్లలు కనబడ్డారు. వాళ్ల దగ్గర ఒక రొట్టెముక్క ఉన్నది. అన్న 'ఆ రొట్టె నాదే' అంటున్నాడు. తమ్ముడు 'అది నాకే కావాల'ని ఏడుస్తున్నాడు. ఒక దశలో ఇద్దరూ కలబడి కొట్టుకోవటం మొదలు పెట్టారు. అంతలో వాళ్ళ అమ్మ వచ్చి, అన్న చేతిలోంచి రొట్టెను తీసుకొని, దాన్ని రెండు ముక్కలు చేసి ఇద్దరికీ ఇచ్చింది.

అది చూశాక అరవింద స్వామికి కనువిప్పైంది. "వేణుగోపాల స్వామి విగ్రహం కోసం, అది తేనున్న ఐశ్వర్యం కోసం ఇంతమంది అమాయకుల ప్రాణాలు బలి కావలసిన అవసరం లేదు. రెండురాజ్యాలకూ మధ్యలో దివ్యమైన మందిరాన్ని నిర్మించి, స్వామిని అందులో ప్రతిష్ఠిస్తే, రెండు రాజ్యాలకూ మేలు జరుగుతుంది కద! తనకు ఇంతవరకూ ఈ ఆలోచన ఎందుకు రాలేదు?" అని ఆయన యుద్ధాన్ని విరమించి, మురారికి ఈ విషయమై ఆలోచించమని కబురు పంపాడు.

అప్పటికే యుద్ధంవల్ల కలిగే చెడు పరిణామాలను చూసిన మురారి, ఈ ప్రతిపాదనకు సంతోషంగా అంగీకరించాడు. త్వరలో రెండు రాజ్యాల నడుమన ఒక భవ్య మందిరం తయారైంది. వేణుగోపాల స్వామి చలవ వల్ల, రెండు రాజ్యాలలోనూ శాంతి సామరస్యాలు మళ్ళీ నెలకొన్నాయి.



# నాట్యం



*రచన: C.కృష్ణవేణి, 7 వ తరగతి, టింబక్టు బడి, చెన్నేకొత్తపల్లి.*

చాలా సంవత్సరాల క్రితం మా ఊళ్ళో బడిలో కృష్ణవేణి, గీతిక అనే ఇద్దరు పిల్లలు ఉండేవాళ్ళు. వాళ్ళిద్దరూ బాగా ఆడుతూ, పాడుతూ, కొట్లాడుకుంటూ, చక్కగా స్నేహితుల్లాగా కలిసి మెలిసి ఉండేవాళ్ళు. కొంచెం పెద్దయ్యేసరికి ఇద్దరూ దగ్గర్లోనే అడవి ప్రదేశంలో ఉన్న ఒక గురుకుల పాఠశాలలో చేరారు.

ఆ బడి చాలా పెద్దది. అక్కడి వాతావరణం చాలా బాగుండేది. చల్లటి గాలి శరీరాన్ని తాకుతూ, చక్కలిగిలి పెట్టేది. ఆ బడిలో ఆటపాటలను, చదువులను సమానంగా ప్రోత్సహించేవాళ్ళు. చదువులు చెప్పటంతో-బాటు, పిల్లలందరికీ చెక్కభజన, కోలాటం, పండరి భజన, సంగీతం, మరెన్నో కళలు నేర్పించేవాళ్ళు.

అయితే గీతికకు ఇవేవీ పెద్దగా ఇష్టం కాలేదు. ఆ పాపకు ఎప్పుడూ కూర్చొని చదవటమే ఇష్టంగా ఉండేది. 'ఎందుకు, అట్లా ఎప్పుడూ

చదువుతూనే ఉంటావు?' అని అడిగిన వాళ్ళకు గీతిక- 'నేను పెద్దయ్యాక డాక్టరునవుతాను. డాక్టరవ్వాలంటే, మరి చాలా పుస్తకాలు చదవాల్సి ఉంటుంది' అని చెప్పేది.

కృష్ణవేణికి మాత్రం ఆట, పాట, అభినయం చాలా ఇష్టం. వీటన్నిటితోపాటు కృష్ణవేణి చదువులు కూడా ఒక మోస్తరుగా- బాగానే చదివేది.

బడి చదువులు పూర్తవ్వగానే అందరూ ఎవరి దారిన వాళ్ళు వెళ్ళారు. గీతిక, కృష్ణవేణిలు కూడా విడిపోయారు. మొదట్లో ఇద్దరూ 'తమ స్నేహితులందరూ ఏం చేస్తున్నారో' అని ఆలోచిస్తూ ఉండేవాళ్ళు; కానీ రాను రాను బడి సంగతుల్ని వెనక్కి నెట్టి, తమ జీవితాల్లో తాము ముందుకు సాగారు.

కాల క్రమంలో గీతిక నిజంగానే చక్కని డాక్టరు అయ్యింది. డాక్టర్ గీతికకు ఇప్పుడు ఆ పట్టణంలో చాలా మంచి పేరుంది. ఆమెకొక పాప. ఆ పాప పేరు విశ్విత. గీతిక తన బిడ్డను ఆ పట్టణంలోకెల్లా పేరున్న పెద్ద బడిలో చేర్పించింది. డాక్టర్ గీతిక విశ్వితకు ఎప్పుడూ చెబుతూఉండేది: "సమయాన్ని వృధా చేసుకోకూడదు, బాగా చదువుకోవాలి, చదువే మనకు పెట్టుబడి" అని. విశ్విత కూడా గీతిక ఆశలకు అనుగుణంగా చక్కగా చదువుకునేది. ఎప్పుడూ తన తరగతిలో ఫస్టు వచ్చేది.

అయితే విశ్వితకు తీరని కోరిక ఒకటి ఉండేది: అదేంటంటే, నాట్యం నేర్చుకోవటం. తను ఎప్పుడు నాట్యం నేర్చుకుందా- మనుకున్నా, వాళ్ల అమ్మ గీతిక ఒప్పుకునేది కాదు- సమయాన్ని వృథా చేసుకోవద్దనేది.

ఒకసారి విశ్విత వాళ్ల బడిలో వార్షికోత్సవాలు జరిగాయి. డాక్టర్ గీతికను ఆ ఉత్సవాల్లో బహుమతులిచ్చేందుకు ఆహ్వానించారు బడివాళ్ళు. ఉత్సవాల సందర్భంగా పెట్టిన వ్యాసరచన, వక్తృత్వం, పద్యపఠనం వంటి అనేక పోటీల్లో విశ్వితకు మొదటి బహుమతి వచ్చింది. అందరూ ఆ పాప తెలివిని అభినందిస్తుంటే, గీతిక ఉప్పొంగిపోయింది. ఆ తర్వాత చివరగా, పిల్లలంతా కలిసి ఒక నాట్య రూపకాన్ని ప్రదర్శించారు.



ఆ రూపకంలో ప్రధాన పాత్ర వహించింది విశ్విత. స్టేజీమీద విశ్వితను చూసిన డాక్టర్ గీతికకు ముందు తనెవ్వర్ని చూస్తున్నదో అర్థం కాలేదు. తెలిశాక, 'విశ్విత నాట్యం ఎప్పుడు నేర్చుకున్నది? ఎప్పుడూ చదువుకుంటూనే ఉన్నది గదా?' అని ఆశ్చర్యపోయింది.

ఆ రూపకంలో విశ్విత నటన అద్భుతంగా ఉండింది. ఆమె నాట్యం చూసిన ప్రతివాళ్ళూ ఆమెను ఎంతో మెచ్చుకోవటం మొదలు పెట్టారు. రూపకం పూర్తయ్యేసరికి, బడి యాజమాన్యం మొత్తం వచ్చి విశ్వితను, గీతికనూ అభినందించటం మొదలుపెట్టింది!

'నీకు నాట్యం ఎవరు నేర్పారే, నాకు ఎప్పుడూ చెప్పలేదు?' అని అడిగింది గీతిక, మురిపెంగా విశ్వితను దగ్గరకు తీసుకుంటూ . దూరంగా ఎవరితోనో మాట్లాడుతున్న తమ డ్యాన్సు టీచరును చూపించింది విశ్విత- ఆవిడ కూడా వృత్తి రీత్యా డాక్టరేనట. అయితే ఆమెకు నాట్యం అంటే చాలా ఇష్టం. అనేక దేశాల్లో నాట్య ప్రదర్శనలు కూడా ఇచ్చిందావిడ. డాక్టరుగా ఎంత ఒత్తిడి ఉన్నాకూడా, ప్రతిరోజూ మధ్యాహ్నంపూట రెండు గంటల పాటు విశ్విత వాళ్ళ బడికి వచ్చి పిల్లలకు నాట్యం నేర్పుతున్నదట!

ఆ తర్వాత ప్రధానోపాధ్యాయుడు స్టేజీనెక్కి, 'పిల్లలకు నాట్యాన్ని పరిచయం చేసి, మా బడికి ఇంత చక్కని నృత్య రూపకాన్ని అందించి, కళల పట్ల మాకందరికీ అభిమానం కల్గించిన డాక్టర్ కృష్ణవేణిని సన్మానిస్తున్నాం, అది మా అదృష్టంగా భావిస్తున్నాం' అనగానే గీతిక నివ్వెరపోయింది. చూడగా, విశ్వితకు నాట్యం

నేర్పింది ఎవరో కాదు- తన చిన్ననాటి స్నేహితురాలు కృష్ణవేణే!

స్టేజీ దిగిరాగానే గీతిక వెళ్ళి కృష్ణవేణి ముందు నిలబడింది. తన చిన్ననాటి స్నేహితురాలు గీతికను గుర్తుపట్టిన కృష్ణవేణి కూడా ఆశ్చర్యానందాలకు లోనైంది. 'విశ్విత తల్లి గీతిక' అని తెలుసుకొని ఆమె ఎంతో సంతోషపడ్డది.

ఆపైన గీతిక-కృష్ణవేణిల స్నేహం కలకాలం వర్ధిల్లింది.

ఇక విశ్వత నాట్యం సాధన చేస్తానంటే ఏనాడూ అభ్యంతరపెట్టలేదు డాక్టర్ గీతిక!

**తెలియని బంధువు!**

జోకు

సుబ్బారావు, కళ ఇద్దరూ ఉద్యోగస్తులే. చక్కని ఇల్లు, ఇంటినిండా సామాన్లు- ఇద్దరూ చాలా సంతోషంగా ఉండేవాళ్ళు. ఒకరోజు సాయంత్రం ఇద్దరూ ఆఫీసునుండి వచ్చేసరికి వాళ్ల ఇంటి వాకిలి ముందు ఒక పూలగుత్తి, ఒక కవరు పెట్టి కనబడ్డాయి.

"ఎవరై ఉంటారబ్బా" అనుకొని కవరు తెరిచి చూశారు.

లోపల రెండు సినిమా టిక్కెట్లున్నై.. సెకండ్ షోవి. వాటితో పాటు ఒక కాగితం ముక్క.

దానిమీద రాసి ఉంది: "నేనెవరో చెప్పుకోండి చూద్దాం?" అని.

ఎంత ఆలోచించినా ఎవరో తెలీలేదు ఇద్దరికీ.

"సరే, తర్వాత తెలుస్తుందిలే" అని , ఇద్దరూ త్వరత్వరగా వంట ముగించుకొని సినిమాకి వెళ్ళారు.

తిరిగి వచ్చి చూసుకుంటే ఏముంది? ఇల్లు గుల్ల!

దొంగ ఎవరో వచ్చి ఇంట్లోని సామాన్లన్నీ పట్టుకెళ్ళాడు!

ఇంకో కాగితం వదిలి వెళ్ళాడు కూడా- దానిమీద రాసి ఉంది: "ఇప్పుడు తెలిసింది గదా, నేనెవరో?" అని!



# బ్రహ్మంగారు!

చిట్టికథ

మూలం: చీమ-ఏనుగు కథా సంకలనం

పున: కథనం: V.రాజు, 7 వ తరగతి, ప్రకృతి బడి, చెన్నేకొత్తపల్లి.



అనగా అనగా ఒక ఊరిలో రంగయ్య అనే రైతు ఉండేవాడు. రంగయ్య కొడుకు మల్లయ్య- చాలా అమాయకుడు. వయసు పెరుగుతున్నది కానీ, వాడికి ఇంకా లోకపు తీరు అర్థం కాలేదు.

రంగయ్య రోజూ ఉదయాన్నే లేచి, గేదెలను తోలుకొని పొలానికి వెళ్ళిపోయేవాడు. ఆ తర్వాత వచ్చి గేదెలను పశువుల పాకలో విడిచి, వాటికి మేత తెచ్చేందుకని మళ్ళీ వెళ్ళేవాడు. అయితే మల్లయ్య మాత్రం బడిలో వచ్చీ-రాని చదువు చదువుకుంటూ ఉండేవాడు తప్పిస్తే, తండ్రికి పనిలో ఏవిధంగానూ సాయపడేవాడు కాదు.

ఒక సారి, బడిలో అయ్యవారు "వీర బ్రహ్మేంద్ర స్వామి చరిత్ర" చెప్పారు, పిల్లలకు. "వీర బ్రహ్మేంద్ర స్వామి చిన్న తనంలో పశువులు

కాసేవాడు. పశువులు కాయటం ఏమంత తక్కువ పని అనుకోకండి" అని అయ్యవారు చెబుతుంటే, మల్లయ్యకు 'ఎప్పుడెప్పుడు ఇంటికెళ్ళి తమ గేదెల్ని కాద్దామా' అనిపించింది. "వీర బ్రహ్మంగారు గేదెల్ని మేపేందుకని అడవికి తీసుకెళ్ళి, ఆ మంద చుట్టూ పుల్లతో ఒక గీత గీసేవాళ్ళట. ఆపైన తాను అక్కడే ఏదో ఒక చెట్టుక్రింద కూర్చొని, కాలజ్ఞానం పాడుకుంటూ ఉండేవాళ్లట. కాలజ్ఞానం ప్రభావం వల్ల, ఆ పశువులు ఏవీ ఆయన గీచిన గీతను దాటి పోయేవి కావట!"

ఇవన్నీ విన్న తర్వాత మల్లయ్యకు గేదెలంటే ఇష్టం పెరిగింది. ఆదివారం రాగానే, వాడు రంగయ్యను ఒప్పించి, గేదెల్ని వెంట బెట్టుకొని తను బయలు దేరాడు అడవికి. అక్కడికి చేరుకున్నాక, బ్రహ్మంగారిలాగా వాడు కూడా గేదెల మంద చుట్టూ పుల్లతోఒక గీత గీసి, తను ఆవలగా ఓ చెట్టు క్రింద కాలజ్ఞానం పుస్తకం పట్టుకొని కూర్చున్నాడు. మధ్య మధ్య వాడు గేదెలకేసి చూసి "ఆహా! ఎంత మహిమ! ఒక్క గేదె కూడా గీతను దాటి వెళ్ళట్లేదు చూడు!" అని మురిసిపోతూ ఉన్నాడు కూడా.

అంతలో, ఎక్కడి నుండి వచ్చిందో మరి, ఒక పులి ఊడి పడింది. వచ్చీ రాగానే అది గీతలోపల మేస్తున్న గేదెలమీదికి దూకి, గబుక్కున ఒక దూడను పట్టుకొని పోయింది! గేదెలన్నీ చెల్లా చెదురయ్యాయి. కాలజ్ఞానం చదువుకుంటూ కూర్చున్న మల్లయ్యకు గేదెలు కాయటంలోని కష్టసుఖాలు తెలిసి వచ్చాయి.

అయితేనేమి, ఇంటికెళ్ళాక రంగయ్య చేతిలో తిట్లు మాత్రం తప్పలేదు మల్లయ్యకు! ఏ పనైనా సరే, మనసు పెట్టి చేస్తే తప్ప సుఖం లేదని వాడికి అర్థమయ్యేసరికి, అలా ఒక దూడ పులి వాత పడనే పడింది, పాపం!




# యువరాజు

*జర్మన్ దేశపు జానపద కథ*

*ఈ జర్మన్ కథను చదవండి- ఇదీ మన కథల్లాగే లేదూ?*

*సేకరణ, కథనం: P. రవ్య, 8 వ తరగతి, ప్రకృతిబడి, చెన్నేకొత్తపల్లి.*



అనగా అనగా ఒక రాజు, రాణి ఉండేవాళ్లు. వాళ్లకు పిల్లలు లేరు. రాణి రోజూ తమ ఉద్యానవనానికి పోయినప్పుడు అక్కడున్న దేవతను ప్రార్థిస్తూ ఉండేది. చివరికి ఆ దేవత కరుణించి, ఆమెకు ప్రత్యక్షమై, 'నీకు ఒక కొడుకు పుడతాడు. అతనికి ఒక వరం ఉంటుంది. పన్నెండేళ్ళు వచ్చాక అతను నన్ను తలచుకొని ఏది కోరితే అది జరుగుతుంది' అని చెప్పి అదృశ్యం అయిపోయింది.

ఆమె చెప్పినట్లుగానే కొన్నాళ్ళకు రాణి గర్భం ధరించింది. ఆమెను చాలా జాగ్రత్తగా చూసుకున్నాడు రాజు. నెలలు నిండగానే ఆమెకు ఒక మగ పిల్లవాడు పుట్టాడు. రాజు-రాణి ల ఆనందానికి మేరలేదు. యువరాజు పుట్టినందుకు రాజ్యం అంతటా ఘనంగా వేడుకలు జరుపుకున్నారు. రాణి తన కొడుకును రోజూ ఉద్యానవనానికి తీసుకెళ్ళి, అక్కడ తాజాగా ఊరిన నీటితో స్నానం

చేయించేది.

ఒకరోజున, ఆమె పిల్లవాడికి స్నానం చేయించాక, వాడిని ఒడిలో పడుకోబెట్టుకొని, అక్కడే నిద్రలోకి జారింది. ఈ అవకాశం కోసమే ఎదురుచూస్తున్నాడు- దుర్మార్గుడైన వంటవాడు ఒకడు! వాడు మెల్లగా రాణి దగ్గరికి వచ్చి, ఆమె ఒడిలోని పిల్లవాడిని ఎత్తుకెళ్లిపోయి ఏదో రహస్య ప్రదేశంలో దాచి పెట్టేశాడు. ఆపైన వాడు కోడి రక్తం తీసుకొచ్చి రాణి చీరకు పూసి, రాజు దగ్గరికి పరుగెత్తాడు- "ప్రభూ! రాణిగారు నేనెంత చెప్పినా వినలేదు. రాజకుమారుడిని తోడేలుకు ఆహారంగా వేసేశారు" అని దొంగ ఏడుపులు ఏడ్చాడు.

రాజు వెళ్ళి చూసే సరికి, ఏముంది? రాజకుమారుడి జాడ లేదు. రాణి చీరమీదంతా రక్తపు మరకలు! రాణి ఎంతచెప్పినా వినలేదు రాజుగారు- ఆమెను కఠినంగా శిక్షించమని ఆజ్ఞాపించి, తను బాధగా అంత:పురానికి వెళ్ళిపోయాడు.

దుర్మార్గుడైన వంటవాడు, రాజ్యపు మంత్రులు కుమ్మక్కై, రాణికి కఠిన కారాగార శిక్ష విధించి, ఆమెను ఒక చీకటి గదిలో బంధించారు. 'ఆమెకు భోజనం, నీళ్ళు ఇవ్వకపోతే ఎలా బ్రతుకుతుంది?' అనుకున్నారు వాళ్ళు. కానీ పావురాలు రెండు, ఆమె పరిస్థితిని చూసి జాలిపడి, ఆమెకు రోజూ ఆహారమూ, నీళ్ళు తెచ్చి ఇవ్వసాగాయి. అలా ఆమె ఆశలన్నీ తన కొడుకు పైననే పెట్టుకొని, ఏనాటికైనా 'మంచి రోజులు వస్తాయి లే' అని బ్రతుకుతూ ఉన్నది.

ఇక రాజకుమారుడు, వంటవాడి ఇంట్లోనే అనామకుడుగా పెరగసాగాడు. వంటవాడు వాడిని తమ ఇంట్లో పనిమనిషిగా పెట్టుకొని, వాడి చేత అన్ని పనులూ చేయించేవాడు. యువరాజుకు వాడు చదువు కూడా నేర్పించలేదు. అయితే, అడవిలో గొర్రెల్ని మేపుతూ, యువరాజు తనంతటతానే చాలా యుద్ధవిద్యలు నేర్చుకున్నాడు.

అలా వాడికి పన్నెండేళ్ళు వచ్చాక, ఒకరోజున అడవిలో తిరుగుతుండగా అతనికి ఒక పాడుపడిన ఉద్యానవనం కనిపించింది. అందులో దేవత విగ్రహం ముందు మోకరిల్లి,

అతను "తల్లీ! నాకు తోడు నీడగా ఉండేటట్లు ఎవరైనా నేస్తాన్ని ఇవ్వు" అని కోరుకున్నాడు. అలా అనుకున్న మరుక్షణం అతనంత వయస్సులోనే ఉన్న ఒక అమ్మాయి అక్కడికి నడుచుకొని వచ్చింది! ఆమె సహాయంతో యువరాజు చదువు నేర్చుకోవటమే కాక, అనేక విద్యలలో ప్రావీణ్యత సంపాదించాడు.




మొదట్లో వాళ్ల స్నేహాన్ని వంటవాడు అస్సలు పట్టించుకోలేదు- కానీ యువరాజు బలం పెరుగుతున్న కొద్దీ వాడికి భయం పట్టుకున్నది. యువరాజుకి నిజం ఎక్కడ తెలిసిపోతుందో, తన తండ్రిని ఎక్కడ కలిసి, తనకు ఎదురు తిరుగుతాడో అని, వాడు 'ఇప్పుడే యువరాజుని చంపేయాలి' అని నిశ్చయించుకున్నాడు.

ఈ పనిని యువరాజు స్నేహితురాలికే అప్పగించాలనుకున్నాడు వాడు! అందుకని వాడు ఆమెనొకరోజున బెదిరించి, 'మారు మాట్లాడకుండా యువరాజును చంపేయమ'ని ఆదేశించాడు. "యువరాజును నువ్వు చంపకపోతే, ముందుగా నిన్ను, ఆపైన యువరాజును నేనే ఎలాగైనా చంపేస్తాను" అనేసరికి, ఆ పాపకు భయం వేసింది. ఆమె తెలివిగా అందుకు ఒప్పుకున్నట్లు నటించి, ఆ సంగతి యువరాజుకు చెప్పేసింది.

మరునాడు వంటవాడు వచ్చేసరికి ఆమె ఒక మేక గుండెను, నాలుకను ఒక పళ్లెంలో పెట్టి ఉంచి, 'అవి యువరాజువే' అన్నట్లు చూపింది వాడికి. తన అడ్డు తొలగిందని, వాడు చాలా సంతోషపడి, బాగా సారాయి త్రాగి, ఆ మత్తులో తను చేసిన తప్పులన్నీ చెప్పేశాడు ఆమెకు.

ఇదంతా చాటునుండి విన్న రాజకుమారుడు దేవతను తలచుకొని, 'ఇన్ని తప్పులు చేసిన ఈ దుర్మార్గుడు ఇకపైన నల్లకుక్కగా మారి, బంగారు గొలుసు వేసుకొని, నిప్పులు తింటూ, జీవితమంతా మనిషి చెప్పుచేతల్లో బ్రతకాలి " అని కోరుకున్నాడు. తక్షణం వంటవాడు కుక్కగా మారిపోయాడు!

ఆ పైన యువరాజు తన తండ్రిని కలుసుకొని, తనెవరో చెప్పాడు. మొదట్లో అతన్ని నమ్మని రాజు, అతను ఆధారాలు చూపించేసరికి, ఒప్పుకోక తప్పలేదు. ఆపైన వాళ్లంతా కొన ఊపిరితో ఉన్న రాణిని చెరవిడిపించి, కాపాడారు. అటు తర్వాత రాకుమారుడు రాజై, తన స్నేహితురాలి సహాయంతో రాజ్యాన్ని చక్కగా పరిపాలించాడు.

**తెలియదు-తెలిసింది!** **జోకు**

రాము ఏడుస్తూ వచ్చాడు వాళ్ళమ్మ దగ్గరికి:

అమ్మ: ఏమిరా, ఎందుకు, ఏడుస్తున్నావు?

రాము: చెల్లి చూడమ్మా, నా జుట్టు పీకింది!

అమ్మ: అది చిన్నది కదా, దానికి తెలీదురా, జుట్టు పీకితే నొప్పి పుడుతుందని, వదిలెయ్యి, ఏమీ పరవాలేదులే.

కొంచెం సేపటికి రాము చెల్లి ఏడుపు వినబడింది.

అమ్మ పరుగెత్తుకొని వెళ్ళేసరికి చెల్లి జుట్టు పీకి ఏడిపించిన రాము అంటున్నాడు:

రాము: ఇప్పుడు తెలిసిందిలేమ్మా, దానికి!



# ఏమో, గుర్రం ఎగరావచ్చు!

*జూన్ సంచికలో''గుర్రం ఎగరావచ్చు' కథ సగం చదివారు- ఆ కథకు ఇదొక ముగింపు-*

*రచన: నారాయణ, కొత్తపల్లి బృందం.*

*జరిగిన కథ: తన గుర్రం ఎగిరేలా చేస్తే అర్థ రాజ్యం ఇస్తానన్నారు రాజుగారు. ముందుకు వచ్చి గుర్రాన్ని ఎగిరించలేక పోతే తల తీసేస్తారు. పేద బ్రాహ్మడు ఒకడు ముందుకొచ్చాడు.. గుర్రం ఎగిరేలా చేస్తానని! ఆరు నెలల గడువు కావాలన్నాడు. ఇక చదవండి..*

చూస్తూ చూస్తూ ఉండగానే ఆరు నెలలూ గడిచి పోతున్నై- ఇంకొక్క రోజే మిగిలింది గడువు తీరేందుకు.

అప్పటివరకూ బ్రాహ్మడు ఆశించింది ఏదీ జరగలేదు- ఒక్కటి తప్ప!

గుర్రం చనిపోలేదు: నిజానికి అది ఇంకా బలంగా తయారై చెంగు చెంగున ఎగురుతున్నది!

రాజుగారూ చనిపోలేదు: ఇప్పుడు ఆయన ఇంకా బలంగా, ఆరోగ్యంగా ఉన్నారు. గూఢచారుల ద్వారా బ్రాహ్మడి ఆలోచనలన్నీ కనుక్కొని ఉన్నారాయన. ఎప్పుడు గడువు

పూర్తవుతుందా, ఎప్పుడు బ్రాహ్మడిని పిలిచి తల తీయించేద్దామా అని ఎదురు చూస్తున్నారాయన!

బ్రాహ్మడూ పోలేదు: బ్రాహ్మడు నిరాశతోటీ, ఆశతోటీ ఊగిసలాడి బక్కచిక్కి పోయాడు- కానీ ఇంకా ఆరోగ్యంగానే ఉన్నాడు!

గుర్రమూ ఎగరలేదు:( పాపం, గుర్రం చాలా మంచి జాతిది. అయితే ఇన్నాళ్ళలోనూ బ్రాహ్మడు దాన్ని ఒక్కసారికూడా ఎక్కనూలేదు; దానికి ఏదీ నేర్పనూ లేదు. రోజూ ఇష్టం వచ్చినంతసేపు అడవిలో తిరుగుతూ, అక్కడి పచ్చికను మేసి మేసి, అది ఇంకా బాగా, బలంగా తయారైంది.

బ్రాహ్మడూ, అతని కుటుంబమూ మాత్రం కడుపునిండా తిండి తిన్నారు ఈ ఆరు నెలలూ.

చివరిరోజు రాగానే బ్రాహ్మడి భార్యకు గాభరా హెచ్చింది. బ్రాహ్మడికీ ప్రాణం మీద ఆశ మొదలైంది. 'ఎలాగైనా బ్రతకాల్సిందే' అనుకున్నారిద్దరూ.

మరునాడు ప్రొద్దునే- తెల్లవారుజామున- గుర్రానికి జీను తగిలించి, నమస్కారం పెట్టుకున్నారు. ఆపైన దానిమీదకి ఎక్కి కూర్చున్నారు ఊరికే. అది ఎటు తీసుకుపోతే అటు పోదామనుకున్నారు. బ్రాహ్మడికి గుర్రపు స్వారీ రాదు. బ్రాహ్మడి భార్యకు అసలే రాదు. రాజుగారికి దొరక్కుండా పారిపోవటమే ఇద్దరి లక్ష్యమూ! ఇద్దరూ కళ్ళెం వదిలి, పదపదమని ప్రార్థించుకుంటూ కూర్చుంటే, పంచకల్యాణి గుర్రం తనంతట తానుగా పరుగందుకుంది. రాను రానూ వేగం హెచ్చింది.. ఇంకా ఇంకా పెరిగిపోతున్నది..చివరికి పతాకస్థాయిని చేరుకున్నది. ఆశ్చర్యం! ఇప్పుడు గుర్రం కాళ్ళు నేలమీద ఆనటం లేదు! అది ఎగిరిపోతున్నది, నిజంగానే!! క్రింద, నేలమీద, నిలబడి రాజుగారూ, మంత్రిగారూ, సైనికులూ ఆశ్చర్యంతో నోళ్లు వెళ్ళబెట్టి చూస్తున్నారు.

బ్రాహ్మడి భార్యకైతే ఇప్పుడు నిజంగా ఉత్సాహం వచ్చింది-

"పదండీ, పదండీ! గుర్రాన్ని క్రిందికి దింపండి! రాజుగారికి మీ మహిమను చూపించండి! మన అదృష్టం పండింది!" అంటోంది.

"నాకు రాదే, గుర్రం ఇష్టం గుర్రానిది. దానికి ఇష్టమైతే ఎగురుతుంది, లేకపోతే నడుస్తుంది- లేకపోతే, ఊరికే పడుకుంటుంది- ఇందులోనేనెవ్వరు, నువ్వెవ్వరు, రాజెవరు?" అన్నాడు బ్రాహ్మడు, వివేకంతో.

వాళ్ల మాటలు విన్నట్లుగానే, గుర్రం వేగం తగ్గించింది. చివరికి అది నేల దిగి, రాజు ముందరికి వచ్చి నిలుచున్నది.

రాజుగారు బ్రాహ్మడిని అభినందించారు. సన్మానించారు. సగం రాజ్యం ఇస్తామన్నారు. కానీ బ్రాహ్మడు వద్దన్నాడు. బదులుగా రాజుగారు ఇచ్చిన అపారమైన ధనాన్ని తీసుకొని, వెను వెంటనే పెట్టే-బేడా సర్దుకొన్నాడు. భార్యను వెంటబెట్టుకొని వేరే దేశానికి వెళ్ళిపోయాడు- ఎవరు ఎంత చెప్పినా వినకుండా.

మరునాడు రాజుగారు గుర్రం ఎక్కారు, హుందాగా. "గాలిలోకి ఎగురు" అని ఆదేశించారు- లాభం లేదు. గుర్రాన్ని తన్నారు. కొట్టారు- ఏంచేసినా గుర్రం పరుగు పెట్టింది తప్ప, గాలిలోకి మాత్రం ఎగరలేదు. సాయంత్రం వరకూ ప్రయత్నించి, ప్రయత్నించి- చివరికి రాజుగారు అలిసిపోయారు.

గుర్రాన్ని వెనక్కి తెచ్చి, క్రిందికి దిగారు- కోపంగా. సేవకులు దాన్ని పట్టుకొని, జీను తొలగించారు-

మరుక్షణం గుర్రం కట్లు తెంచుకున్నది. గోడలు దాటుకుంటూ పరుగు మొదలుపెట్టింది..ఇంకా ఇంకా వేగంగా పరుగెత్తింది..చూస్తూండగానే అది గాలిలోకి ఎగిరింది! పడమటన మెరిసే చుక్కలాగా, చివరికి అదృశ్యమైపోయింది!



# చందమామ చల్లన!

చిట్టి పొట్టి కథ

రచన: శ్రీమతి సి. అరుణావతి, ఉపాధ్యాయురాలు, అనంతపురం జిల్లా.

ఒక రోజు ఐస్‌క్రీం పోతూ ఉంది.



పెద్దగాలి వచ్చింది.
కొంచెం ఐస్క్రీం ఎగిరిపోయింది.





మళ్ళీ పోతా పోతా ఉంటే వానొచ్చింది.
గొడుగు తీసేలోపల కొంచెం ఐస్క్రీం బురదలోపడిపోయింది.

వాన తగ్గింది. ఐస్క్రీం గొడుగు ముడిచింది.

ఇంతలో ఎండ వచ్చింది!

వేడికి ఐస్క్రీం అంతా కరిగిపోయింది!



అయితేనేమి..?..

ఐస్క్రీం నేరుగా అలా అలా ఆవిరై, చందమామ దగ్గరికి వెళ్లింది.

అందుకే చందమామ- చల్..ల్......ల్లగా ఉంటాడు!



# పుణ్యం



*కథనం: పూజారప్ప కుమారుడు ఓబుళపతి, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా.*

కాశీ పరమ పవిత్రమైన శైవ క్షేత్రం. కాశీ విశ్వేశ్వరుణ్ని దర్శిస్తే పాపాలన్నీ నశిస్తాయని, ఇక పునర్జన్మ ఉండదని భక్తుల విశ్వాసం. అందుకని లక్షల సంఖ్యలో భక్తులు ప్రతిరోజూ విశ్వేశ్వరుడిని దర్శించుకొని వెళ్తుంటారు.

ఒక శివరాత్రి పండుగ రోజున అలా శివుడిని దర్శించుకునేందుకు బారులు తీరిన జనాల్ని చూసి, పార్వతి శివుడితో "స్వామీ! కాశీకి వెళ్ళిన వాళ్ళంతా కైలాసానికి వస్తారంటారే, మరి ఇంత మంది కైలాసానికి వచ్చేస్తే ఇక మనం ఉండేందుకు అక్కడ చోటు మిగలదేమో, ఎలాగ?" అన్నది.

శివుడు నవ్వి, "ఇంతమంది కైలాసానికి రావటం ఎలా సాధ్యం దేవీ? వీళ్ళలో ఒకళ్లిద్దరు ఉంటారేమో, కైలాసవాసానికి అర్హత ఉన్నవాళ్ళు!" అన్నాడు.

"ఎలాంటి వాళ్ళు?" అడిగింది పార్వతి.

"చూద్దాం, రా!" అని శివుడు పార్వతిని

వెంట బెట్టుకొని బయలుదేరాడు.

శివపార్వతులు ఇద్దరూ ముసలివాళ్ళుగా మారారు. శివుడు తొంభై ఏళ్ళ ముసలివాడైనాడు. పార్వతి ఎనభై ఏళ్ళ ముసలమ్మ వేషం ధరించింది. ఇద్దరూ కాశీ విశ్వేశ్వరాలయ సింహద్వారం చేరారు. అక్కడ ముసలమ్మ తన భర్త తలను ఒళ్ళో పెట్టుకొని కూర్చున్నది. దేవాలయంలోకి వెళ్ళే వాళ్లందరినీ "అయ్యా, భక్తులెవరైనా దయ తలచండి! నా భర్త దాహం తీరేందుకు కొంచెం గంగా జలం పోయండి! నేను వెళ్ళి గంగా జలం తీసుకు రావటం సాధ్యం కాదు. నా భర్త ప్రాణాపాయ స్థితిలో ఉన్నాడు- ఏ క్షణంలోనైనా ప్రాణం పోవచ్చు. ఈ స్థితిలో నేను ఆయన్ని విడిచి వెళ్ళలేను. మీరెవరైనా కొంచెం సాయం చేయండి" అని వేడుకుంటున్నది.

గుడిలోకి వెళ్ళే భక్తులంతా అప్పటికే గంగానదిలో స్నానం చేసి, తడి బట్టలతో, చేతిలో ఉన్న పాత్రల్లో గంగా జలం నింపుకొని వస్తున్నారు. ఆ గంగ నీటితో విశ్వేశ్వరుణ్ని అభిషేకిస్తారు వాళ్ళు. "ఇదేమిటి, విశ్వేశ్వరుని దర్శనానికి వస్తే ఈ దరిద్ర దేవత ఎదురైంది?" అని కొందరు ముసలమ్మను తప్పించుకొని వెళ్ళారు. మరికొందరు "ఉండమ్మా, మేం ఇంకా దేవుడిని దర్శించుకోనే లేదు; అభిషేకం అయిన తర్వాత వచ్చి నీ భర్త సంగతి చూస్తాము" అని చెబుతూ లోనికి వెళ్ళిపోయారు.

ఆ సమయంలో ఒక దొంగ వచ్చాడు అక్కడికి. "దేవాలయ సింహద్వారం దగ్గర భక్తులు క్రిక్కిరిసి ఉన్నారు. 'జేబులు కొట్టవచ్చు; అలాగే ఆడవారి మెడలలోని నగలు అపహరించవచ్చు" అని వచ్చాడు ఆ దొంగ. అందరినీ అడిగినట్లే ముసలమ్మ ఆ దొంగను కూడా అడిగింది-"అయ్యా! మేం విశ్వేశ్వరుడిని దర్శించేందుకు వచ్చాం. కానీ వయసు పైబడిన నా భర్త అలసిపోయి, ఇక్కడే కూలబడ్డాడు. ఎవరైనా పుణ్య ప్రభువులు, ఇంత గంగా జలం తెచ్చి ఆయ నోట్లో పోస్తే సేదతీరుతాడేమో. అందరినీ అడుగుతున్నాను నాయనా, నువ్వైనా దయచూడు" అని.

దొంగ చేతిలో ఒక సొరకాయ బుర్రనిండా గంగ నీళ్ళు ఉన్నాయి. అతను "దానిదేముంది

అవ్వా, ఇప్పుడే తెచ్చుకున్నాను గంగ నీళ్ళు- ఇవిగో!" అని ఆ నీళ్ళను ముసలాయన నోట్లో పోసేందుకని మోకాళ్ళపైన కూర్చున్నాడు.



అవ్వ అన్నది- "కాస్త ఆగు నాయనా! ఆయన నోట్లో నీళ్ళు పోసేముందు, నువ్వు చేసిన పుణ్యకార్యాల్లో ఏదో ఒకటి చెప్పి, ఆ పైన నీళ్ళు పొయ్యి బాబూ! నీ పుణ్యంవల్లనైనా ముసలాయన మంచి లోకాలకు పోతాడు" అని.

దొంగకు ఏం చేయాలో తోచలేదు. గుర్తు ఎరిగిన నాటి నుండీ 'తను చేసిన మంచి పని' అంటూ ఒక్కటీ లేదు! ఇలా తన పుణ్యాన్ని లెక్కించుకునే అవసరమూ ఏనాడూ ఎదురవ్వలేదు! అతను సిగ్గుపడుతూ అన్నాడు ముసలమ్మతో- "అమ్మా, నేనొక దొంగను. ఇంతవరకూ నేను ఒక్క పుణ్యకార్యం కూడా చేయలేదు. ఇదిగో, ఇప్పుడు, ఈయన నోట్లో గంగాజలం పోద్దామనుకున్నానే, ఇదొక్కటే కావొచ్చు, నేను చేస్తున్న మంచి పని" అని చెప్పి, ముసలాయన నోటిలో నీరు పోశాడు అతను.

మరుక్షణం శివ పార్వతులు ఆ దొంగకు నిజరూపాలతో దర్శనం ఇచ్చారు: "నాయనా, నిజం చెప్పటం ద్వారా నువ్వు ఈనాడు గొప్ప పుణ్యం సంపాదించుకున్నావు. సత్యాన్ని మించిన ధర్మం లేదు. నువ్వు చేసిన ఈ ఒక్క మంచి పని వల్ల, ఇంతకాలంగా చేసిన పాపాలన్నీ పటాపంచలయ్యాయి. ఇకపైన చెడు పనులు చేయకు. పవిత్రంగా బ్రతుకు. మానవ సేవే పరమార్థంగా భావించిన నువ్వు, జన్మాంతంలో కైలాసానికి చేరుకుంటావు" అని, వాళ్లు అంతర్ధానమయ్యారు. ఆపైన దొంగ పూర్తిగా మారిపోయాడు. జీవితాంతం మంచిపనులు చేస్తూ గడిపాడు.

"చూశావా! ఇలాంటి ఏ కొందరో వస్తారు, కైలాసానికి. పరోపకారాన్ని మించిన ప్రార్థన లేదు" అన్నాడు శివుడు, పార్వతితో. "అవును" అన్నది పార్వతి, అంగీకరిస్తూ.



# అత్యంత సంపన్నమైన కప్ప కథ

*మూలం: పర్తాప్ అగర్వాల్*

*పున:కథనం: నారాయణ, కొత్తపల్లి బృందం.*



కొత్తగా బడిలో చేరారొక టీచరుగారు. ఆ టీచరుగారికి చాలా కథలు వచ్చు. పిల్లల్ని మంచి చేసుకోవటానికి కథల్ని మించినవి లేవు అని ఆయనకు బాగా అర్థమైంది. అందుకని, ఒకసారి, తరగతిలో పిల్లలకు నీతిబోధ చేద్దామనుకుని, "నేనిప్పుడు మీకొక కథ చెబుతాను" అన్నాడాయన. "చెప్పండి సార్, చెప్పండి సార్!" అని ఉత్సాహంగా అరిచారు , పిల్లలంతా. ఆయన చెప్పిన కథ ఇలా సాగింది:

"అనగా అనగా అనగా ఒక అడవి ఉండేది. ఆ అడవిలో ఒక వాగు- ఎప్పుడూ చాలా నీళ్లతో, ఆ వాగు చాలా అందంగా ఉండేది. దానిమీదినుంచి పోయేందుకు ఏనాడో ఒక వంతెన కట్టి ఉన్నారు. ఆ వంతెన క్రింద- టి ఒడ్డున, నివసిస్తూ ఉండేది, ఒక కప్ప.

ఒక రోజు ఆ కప్ప భోంచేసి, విశ్రాంతిగా పడుకొని ఉన్నప్పుడు, వంతెనపైనుండి టపుక్కున దాని వీపు మీద ఏదో పడింది.

"ఏంటబ్బా, ఇది?" అనుకొని, కప్ప వెనక్కి తిరిగి, వెల్లకిలా పడి, చివరికి ఆ బరువును నేలమీదికి దింపి చూసింది.

చూడగా అది ఒక యాభై పైసల నాణెం!

"అబ్బ! ఎంత డబ్బు దొరికింది, నాకు!" అనుకున్నదా కప్ప. "ఇప్పుడు నాకు చాలా డబ్బు దొరికింది! ఏ కప్ప దగ్గరా ఇంత డబ్బు ఉండి ఉండదు. ఎంత బరువున్నదో చూడు! ప్రపంచంలోకెల్లా అత్యంత ధనవంతమైన కప్పను నేనే అయి ఉంటాను!" అనుకొని, అది గట్టిగా బెకబెకలాడటం మొదలుపెట్టింది.

దాని అరుపులు విని, అక్కడుండే ఇతర కప్పలన్నీ తలెత్తి చూసి, వచ్చి దాని చుట్టూ మూగాయి- "ఏమైంది, ఏమైంది?" అంటూ. మన హీరో కప్ప అప్పుడు వాటన్నిటికీ ఏం జరిగిందో చెప్పి, "ఇప్పుడు ఈ విశ్వంలోకెల్లా అత్యంత ధనవంతమైన కప్పను నేనే! నిశ్చయంగా!" అన్నది గర్వంగా, మురిసిపోతూ.

"అవును, సందేహంలేదు. నువ్వే అత్యంత ధనిక కప్పవు!" అవి వంతపాడాయి కప్పలన్నీ. ఆ ఉత్సాహంలో అవన్నీ మన కప్పను తమ నాయకుడిగా ఎన్నుకునేశాయి! ఆ కప్ప ఇంకా పొంగిపోయింది- తనను ఇలా నాయకుడిగా ఎన్నుకున్న పేద కప్పల కష్టాలన్నిటినీ తీర్చేస్తానని, కప్ప జాతి ముందున్న సమస్యలన్నింటినీ పరిష్కరిస్తాననీ' హామీ కూడా ఇచ్చేసిందది. "

టీచరు గారు ఈ కథ చెబుతుంటే పిల్లలంతా సంతోషంగా వింటున్నారు. అందరి ముఖాలూ విప్పారి ఉన్నాయి. టీచరు గారు కథను కొనసాగించారు:

" కొన్ని రోజుల తర్వాత, ఆ ఏరు దగ్గరికి ఒక ఏనుగు వచ్చింది. అది కడుపునిండా ఏరులోని చల్లటి నీటిని త్రాగాక, ఇక స్నానం మొదలుపెట్టింది. ఏనుగు స్నానం ఎలా ఉంటుందో తెలుసు కదా, తొండం నిండా నీళ్ళు నింపుకొని చిమ్ముతూ, లావుపాటి కాళ్లతో- బరువైన అడుగులతో నీళ్ళను తొక్కుతూ, అన్ని దిక్కులా నీళ్ళు ఎగిరేట్లు చిందులేస్తూ, అది ఏరును చిందర వందర చేస్తుంటే, అక్కడ నివాసం ఉంటున్న కప్పలన్నీ భయంతో వణికి పోయాయి. అవన్నీ తమ నాయకుడి దగ్గరికి

వెళ్ళి, "నాయకా! మీరు తప్ప వేరే గతి లేదు. మీరే ఈ ఏనుగుకి బుద్ధి చెప్పాలి. మనవాళ్లని పీడించవద్దనీ, తక్షణం ఇక్కడినుండి వెళ్లిపొమ్మనీ దాన్ని ఆదేశించాలి మీరు. మీరు స్వయంగా చొరవ తీసుకుంటే తప్ప, ఇక లాభం లేదు." అని మొరపెట్టుకున్నాయి. "

టీచరుగారు కథను ఆపి పిల్లలకేసి చూశారు- పిల్లల ముఖాల్లో భయమూ, బాధ! ఆయన కథ కొనసాగించారు:

"నాయక కప్పకు తనవారిమీద చాలా జాలి వేసింది. ఏనుగు మీద చాలా కోపం వచ్చింది. అది వెంటనే ఏనుగుని ఉద్దేశించి చాలాసార్లు గట్టిగా బెక బెక మని అరిచింది. ఏనుగుకి దాని బెకబెకలు వినిపించాయి, కానీ అది వాటిని అసలు పట్టించుకోలేదు. కప్పకు కోపం హెచ్చింది.

అది ఏనుగు ముందుకి వెళ్ళి నిల్చుని, ఇంకా తీవ్రంగా అరవటం మొదలు పెట్టింది. అయినా పట్టించుకోలేదు,ఏనుగు! కప్పకి రోషం హెచ్చి, తను స్వయంగా వెళ్ళి ఏనుగు ఆటలకి అడ్డం పడింది- దాంతో ఒళ్ళు మండిన ఏనుగు తొండంతో కప్పను పట్టుకొని, పైకెత్తి, అక్కడే ఉన్న బండ మీదికి దాన్ని విసిరి కొట్టింది.



ఆ దెబ్బకు బడాయి కప్ప కాస్తా టపుక్కున చచ్చిపోయింది. అది చూసి, మిగిలిన కప్పలన్నీ భయపడి, నోళ్ళు మూసుకొని, గబుక్కున నీళ్లలోకి దూకి, బండల మాటున దాక్కున్నాయి. ప్రపంచంలోకెల్లా అత్యంత సంపన్నమైన కప్ప జీవితం, అట్లా ఒక మామూలు ఏనుగు తొండం వల్ల ముగిసిపోయింది- ఎట్లా ఉంది కథ?" అని , టీచరుగారు పిల్లల వైపు చూశారు.

పిల్లల ముఖాలు వాడిపోయి ఉన్నై. వాళ్లెవ్వరికీ ఈ కథ నచ్చలేదని తెలుస్తూనే ఉన్నది. కొంతమంది పిల్లలైతే నిశ్శబ్దంగా ఏడవటం మొదలు పెట్టారు కూడాను!

టీచరుగారికి బాధ వేసింది. పిల్లల్ని అలా

ఏడిపిస్తే ఎలాగ? అందుకని ఆయన కథను కొనసాగిద్దామనుకున్నారు ఇంకా:

"కథ అయిపోయిందనుకున్నారా? అయిపోలేదు. ఇప్పుడు మీరు చెప్పండి, ఆ తర్వాత ఏమై ఉంటుందో?" అన్నారాయన, తనుకూడా 'కథను ఎలా ముగిస్తే బాగుంటుందా' అని ఆలోచిస్తూ.

అప్పుడో తెలివైన పిల్లాడు కథను ఇలా ముగించాడు:

"ఆ కప్ప అయితే ఎలాగూ చచ్చిపోయింది. కానీ, దాని ఆత్మ ? ఆ ఆత్మ నేరుగా ఎక్కడికి వెళ్ళాలో ఆ మూలకే వెళ్ళి కూర్చున్నది. అది చేరుకున్న ఆ చోటు- చెప్పాలంటే- అంత గొప్పగానూ లేదు; అంత చెడ్డగానూ లేదు. అయితే అక్కడ ఎవరెవరు ఉన్నారో తెలుసుకుంటే మీక్కూడా ఆశ్చర్యం వేస్తుంది. అక్కడ ఒక నలుగురైదుగురు బిర్లాలు, కొందరు టాటాలు, ఒక రాక్‌ఫెల్లర్, ఒక విక్టోరియా మహారాణి, ఇంకా- కొందరు మోడీలు, కొందరు సింఘానియాలు, కొందరు ఫోర్డులు, ఉన్నారు! నెపోలియన్, అలెగ్జాండర్, చంగీజ్‌ఖాను, నీరో చక్రవర్తి- ఇట్లాంటి గొప్పవాళ్ళు- ఇంకా చాలామంది- ప్రపంచపు ధనికుల్లో ఎంచదగ్గవాళ్ళు- అందరూ ఉన్నారక్కడే. మరి మన కప్ప కూడా, అన్ని కప్పల్లోకీ అత్యంత ధనిక కప్ప కదా, అందుకని అదికూడా హాయిగా వాళ్లందరితోటీ కలిసి ఉండిపోయిందక్కడ!"

పిల్లలందరూ సంతోషంగా చప్పట్లు కొట్టారు. 'ప్రతివాళ్ళూ కోరుకునేది ఇట్లాంటి అంతమే' అని అర్థమైంది టీచరుగారికి.

ప్రపంచంలోకెల్లా అత్యంత ధనికులైన వాళ్ళకు ఈ కథ తెలిస్తే వాళ్ళు ఏమంటారో, మరి?!



# పీటర్ గొర్రె కథ

*మూలం: పర్తాప్ అగర్వాల్*

*తెలుగు అనుసరణ: నారాయణ*



ఆల్ప్స్ మంచుకొండల్లో చాలా కాలం క్రితం పీటర్ అనే కొండగొర్రె ఒకటి ఉండేది. కొండలపైన, ఎగుడు దిగుడు నేలమీద, నిటారుగా జారే వాలుల మీద పీటర్ చాలా చాకచక్యంగా తిరుగుతుండేది. పెద్ద పెద్ద బండరాళ్ల మధ్యలో దుబ్బలు దుబ్బలుగా పెరిగే పచ్చగడ్డి, అది ఎంత తిన్నా తరిగేది కాదు. అయితే, దాన్ని సంపాదించుకునేందుకు మాత్రం పీటర్ చాలా శ్రమ పడాల్సి వచ్చేది. అలా తిరిగీ తిరిగీ పీటర్ శరీరం గట్టిగా, బలంగా తయారైంది.

అయితే, పెరుగుతున్న కొద్దీ పీటర్‌కు మునుపెన్నడూ లేని సమస్య ఒకటి ఎదురైంది: దాని కొమ్ములు ఆగకుండా పెరుగుతూ పోయాయి. కొంచెం ముందుకు- మళ్ళీ క్రిందికి- మళ్లీ దాని ముందుకాళ్ల సందులోంచి, వెనక్కి- అటునుండి వెనక కాళ్ల సందుల్లోంచి బయటికి- అట్లా పెరుగుతూనే పోయాయి.

చివరికి అవి పీటర్‌ను దాటి, దాని వెనకవైపున ఒక అడుగు పొడవు పెరిగాక గానీ ఆగలేదు!

ఇంత పొడుగు కొమ్ములతో పీటర్‌కు మేత వెతుక్కోవటంకూడా కష్టమైంది. రాళ్ల సందుల్లోను, చెట్లు-తుప్పలలోను తరచు దాని కొమ్ములు ఇరుక్కునేవి. అలాంటి సందర్భాల్లో అది గనక క్రిందికి జారి ఉంటే చాలా ప్రమాదాలు సంభవించి ఉండేవి- కానీ అది చాలా జాగ్రత్తగా ఉండటం నేర్చుకున్నది గనక సరిపోయింది. ఒక్కోసారి, దానికి ఆకలేసి ఎక్కువెక్కువ గడ్డి తినాలని ఉన్నప్పుడు, దాని కొమ్ములే దాని నోటికి అడ్డం వచ్చేవి!

రాను రాను పీటర్‌కు పర్వతాగ్రాల మీద బ్రతకటం కష్టమైంది. చుట్టూతా గడ్డి ఉన్నా, అందుకొని తినలేని పరిస్థితి దానిది, పాపం! అందుకని, ఒకరోజున అది కొండల దిగువన ఉండే మైదాన ప్రదేశంలో తనకు ఏమైనా అచ్చి వస్తుందేమో చూసేందుకని బయలుదేరి పోయింది.

మైదానంలో జడల బర్రెలు మందలు మందలుగా తిరుగుతున్నై. వింత కొమ్ములు పెట్టుకొని, తమ మధ్యలోకి ఊడిపడిన ఒంటరి గొర్రెను చూసి, మొదట్లో అవి చాలా కోపగించుకున్నాయి. తమ ప్రాంతంలోకి ఇతరులు ప్రవేశించటం వాటికి ఏనాడు నచ్చలేదు; వాటిలో బలమైనవి కొన్ని పీటర్‌ను చుట్టుముట్టి, ఎటూ కదలనివ్వక, తమ వాడి కొమ్ములతో పొడిచేందుకు కాలు దువ్వసాగాయి.

పీటర్ వాటి పెద్దరికాన్ని గౌరవించింది- ఎంతో మర్యాదగా, గౌరవంగా, తన కొచ్చిన కష్టాన్ని వివరించింది వాటికి. కొంతసేపటికి వాటికి సమస్య అర్థమై, అవి పీటర్‌ను తమ నాయకుల దగ్గరికి తీసుకెళ్ళాయి. గుంపు పెద్దలు కొంచెం ఆలోచించాక, పీటర్‌ని తమతోబాటు ఉంచుకు-నేందుకు ఒప్పుకున్నాయి. పీటర్ సంరక్షణ బాధ్యతను కూడా నెత్తిన వేసుకున్నాయి అవి! అటు తర్వాత పీటర్ అంతే వయసున్న జడల బర్రెలు కొన్ని దానితో స్నేహం చేశాయి. రోజూ అవన్నీ కలిసి తమవైన ఆటలూ ఆడుకోవటం మొదలుపెట్టాయి. పీటర్‌కూ వాటి సహచర్యమూ, ఆటలూ ఎంతో నచ్చాయి.

అయితే, ఆ సరికే వేటగాళ్ళు కొందరి దృష్టిలో పడి ఉన్నది పీటర్. వాళ్ళు దానికోసం మంచుకొండల పైన అంతా వెతికారు. అయితే ఇప్పుడు అది అక్కడ లేకపోయేసరికి, వాళ్లకు అనుమానం వచ్చి, మైదానాల్లో జడల బర్రెల గుంపుల్లో వెతకటం మొదలుపెట్టారు. పీటర్‌కున్న పొడవాటి కొమ్ముల్ని అమ్ముకుంటే చాలా డబ్బులు వస్తాయని వాళ్లు ఆశ పడ్డారు. కానీ వాళ్లెప్పుడు వచ్చినా, జడల బర్రెలన్నీ పీటర్ చుట్టూ మూగి, అది వాళ్ల కంటపడకుండా కమ్ముకొని, కాపాడటం మొదలుపెట్టాయి. అయినా పీటర్ వాళ్ల కంట పడనే పడింది. ఇప్పుడు వాళ్ళు 'జడల బర్రెల రక్షణ వలయాన్ని ఎలా ఛేదించాలా' అని పథకాలు వేయటం మొదలుపెట్టారు. వాళ్లలో ఒకడైతే ఏకంగా ఒక హెలికాప్టర్‌నే తెచ్చుకొని ఆకాశంనుండి గొర్రెను కాల్చేందుకుప్రయత్నించాడు!

ఇక పీటర్‌ను తమతోబాటు ఉంచుకోవటం సాధ్యం కాదని గ్రహించాయి జడల బర్రెలు. వేటాడే మనుషులనుండి దాన్ని కాపాడేంత శక్తి లేదు వాటికి. చివరికి అవి పీటర్‌కు సలహా ఇచ్చాయి: "మైదానాల్లో నీకు భద్రత ఉండదు. మళ్లీ కొండలమీదికే వెళ్లిపో. అక్కడి వాలుల్లోను, బండరాళ్లల్లోనూ నీకు తప్పించుకునే అవకాశాలు ఎక్కువ" అని. పీటర్‌కు తన మిత్రుల్నందరినీ వదిలి వెళ్లటం కష్టం అనిపించింది- కానీ తప్పదు! అది వాళ్ళందరికీ వీడ్కోలు చెప్పి, మళ్లీ కొండలపైకి ఎక్కింది.

కానీ వేటగాళ్ళు దాని కదలికల్ని గమనిస్తూనే ఉన్నారు. దాని జాడ పట్టుకొని వచ్చిన వేటగాళ్ళు కొందరు దాని వెంటపడి తరమటం మొదలెట్టారు. పీటర్ బండరాళ్ల మీదినుండి దూకుతూ, ఇంకా ఇంకా పైకి పోయింది. వేటగాళ్ళు కూడా బాగా అలిసిపోయారు; కానీ వాళ్ళూ పట్టు విడవలేదు. చివరికి పీటర్‌కు ఇక ఎటూ పోలేని పరిస్థితి ఎదురైంది- అది ఇప్పుడొక కొండచరియ కొన కొమ్మున ఉన్నది! వెనక్కి తిరిగితే వేటగాళ్ళు! ముందుకు, అనంతంగా విస్తరించిన మంచుకొండల లోయ! ఆ లోయలోకి పడితే తన ఎముకలు కూడా మిగలవని భయం వేసింది పీటర్‌కు. కానీ

ఇప్పుడు చేయగలిగిందేమీ లేదు- వేటగాళ్ళు దగ్గరికి వచ్చేస్తున్నారు- అది లేని శక్తిని తెచ్చుకొని, కళ్ళు మూసుకొని, కొండ చరియ మీదినుండి లోయలోకి దూకేసింది!

ఆశ్చర్యం! దానికి ఏమీ కాలేదు! కనీసం చర్మం కూడా దోక్కుపోలేదు! ఎముకలు విరగటం అటుంచి, కనీసం ఒక్క వెంట్రుక కూడా కదల్లేదు! అది పోయి, నేరుగా కొండవాలులో పేరుకున్న మంచుమీద పడింది. అప్పటివరకూ అది ఉపయోగం లేనివీ, అసహజమైనవీ అనుకున్న దాని కొమ్ములే మొదట నేలకు తగిలి, జారాయి- చెక్కలాంటి ఆ కొమ్ములమీద, పీటర్ ఆ కొండ వాలున జారటం మొదలెట్టింది. పేరుపొందిన ఆటగాళ్ళు కాళ్లకు చెక్కలు కట్టుకొని మంచుమీద 'స్కీయింగ్' చేసినట్లు, ఈ గొర్రె, తనకు స్వత:సిద్ధంగా వచ్చిన కొమ్ములమీద స్కీయింగ్ మొదలుపెట్టింది!

జారే వేగం పెరిగినకొద్దీ అది కొంచెం భయపడింది, కానీ కొంచెం తేరుకునే సరికి, పీటర్‌కు ఈ ఆట చాలా నచ్చింది! అది ఇప్పుడు అటూ ఇటూ వంగి, తన ప్రయాణదిశను మార్చుకోగల్గుతున్నది! అలా కొమ్ములమీదే వేగంగా జారుతూ అది దారిలో ఎదురైన ఆటంకాలను కూడా ప్రక్కకు తప్పించటాన్ని సాధన చేసింది!



ఇది ఎంత బావుండిందంటే, అది తన కష్టాలన్నిటినీ మరచిపోయి ఆ ఆటలో మునిగిపోయింది! అలా పోయి పోయి, చివరికి అది ఒక చదును ప్రదేశం చేరుకున్నది. అక్కడ రంగు రంగుల జెండాలూ, గుడారాలూ, తోరణాలూ వేసుకొని, వాయిద్యాలు వాయిస్తూ, గాలి పటాలు, బెలూన్లు ఎగరేస్తూ చాలామంది మనుషులు- సంతోషంగా చప్పట్లు

చరుస్తూ దానికి స్వాగతం పలికారు!

నిజానికి ఏం జరిగిందంటే, పీటర్ దూకిన ఆ కొండ చరియ, ఆ ప్రాంతంలో ఉన్న వాలుల్లోకెల్లా ఎత్తైనది. ఆ కొండవాలున ప్రతిఏటా స్కీయింగ్ పోటీలు జరుపుతుంటారు. అయితే అన్ని సంవత్సరాల చరిత్రలోనూ, పీటర్ దూకినంత ఎత్తునుండి ఆ వాలుపైకి దూకిన యోధులే లేరు! మహామహులైన మనుష్యులెవ్వరూ సాధించని ఘనతను ఒక కొండగొర్రె సాధిస్తుంటే, చూసినవాళ్లంతా ముక్కున వేలు వేసుకున్నారు. పీటర్ అందరి రికార్డులనూ బ్రద్దలుకొట్టి, మొదటి స్థానంలో నిల్చింది!

వాళ్లందర్నీ చూసి పీటర్ భయపడి పారిపోయేందుకు ప్రయత్నించింది- కానీ వాళ్ళు దాన్ని ముట్టి, తట్టి, బుజ్జగించి, మెచ్చుకొని, దాని మెడలో 'మొదటి స్థానం' అని రంగురంగుల 'మెడల్' వేసే సరికి, దానికి ఎక్కడలేని ఉత్సాహమూ వచ్చింది. తర్వాత ఆ పోటీ నిర్వాహకులు పీటర్‌కు రావలసిన బహుమతి డబ్బుల్ని దాని సంరక్షణకోసం కేటాయించారు కూడాను! దానితో పీటర్ ఆపైన నిశ్చింతగా బ్రతికింది. ఒకప్పుడు భారంగా తోచిన వింత కొమ్ములే తనకు తోడు-నీడ అయ్యేసరికి అది ఆశ్చర్యపోయింది!

జోకు

ఎవరి తెలివి?!

కొడుకు: నాన్నా, తాతయ్యకు బట్ట తల ఎందుకుంది నాన్నా?

నాన్న: బట్టతల తెలివికి గుర్తు బాబూ! మీ తాత అంత తెలివైన వాడు అన్నమాట!

కొడుకు: మరి మీకు అస్సలు బట్టతల లేదేమి నాన్నా?



# నలుగురు బిచ్చగాళ్ళు

మూలం: A.K.రామానుజన్

తెలుగు అనుసరణ: నారాయణ.



అనగా అనగా నలుగురు బిచ్చగాళ్ళుండేవాళ్ళు. సన్యాసులకుమల్లే కాషాయ బట్టలు వేసుకొని, వాళ్ళు ఊరూరా తిరిగి అడుక్కునేవాళ్ళు.

ఒకసారి వాళ్లకు ఆ దేశపు రాజుగారిని యాచించాలని కోరిక పుట్టింది. అయితే వాళ్ళు ఏ శాస్త్రాలూ చదువుకోలేదు. పొట్టపొడిస్తే అక్షరం ముక్క రాదాయె! రాజుల్ని ఏనాడూ చూడలేదు; వాళ్లని కలిశాక ఏమనాలో, వాళ్లని ఎలా సంబోధించాలో, ఏమని ఆశీర్వదించాలో- ఏమీ తెలీలేదు వాళ్ళకు.

ఒక పొలం ప్రక్కన నిలబడి ఆ సంగతినే చర్చించటం మొదలు పెట్టారు వాళ్ళు. అంతలో వాళ్లకొక పందికొక్కు కనబడింది. దాన్ని చూడగానే మొదటివాడికి ఒక గొప్ప ఆలోచన తట్టింది- "నాకు తెలిసిపోయింది!

రాజును ఎలా సంబోధించాలో నాకు అర్థమైంది! రాజును కలిసి నేనంటాను, 'పందికొక్కులు! చూడు, మట్టిని ఎట్లా తోడి పోస్తున్నాయో! పరపర! కిరకిర!' అని!" అన్నాడు వాడు సంతోషంగా.

మిగిలిన ముగ్గురికీ ఇంకా ఏమీ ఆలోచనలు రాలేదు. కానీ 'నడుస్తూపోతే అవే వస్తాయిలె'మ్మని, వాళ్ళంతా రాజధాని వైపుకు నడవటం మొదలుపెట్టారు. ఇంకొంచెం దూరం వెళ్ళే సరికి, ఒక చెరువు గట్టున కూర్చున్న కప్పలు కొన్ని కనబడినై, వాళ్లకు. వీళ్లు వచ్చేంత వరకూ బెకబెకమంటూ ఉన్నవల్లా, వీళ్లని చూడగానే అరవటం మానేసి అవి అన్నీ బుడుంగున నీళ్లలోకి దూకినై.

వాటిని చూడగానే రెండోవాడికి తను రాజుగారితో ఏమనాలో తెల్సిపోయింది! ' తనంటాడు-" లావుపాటి కప్ప, బెకబెక కప్ప! దిగబడింది చూడు, బంక బంక కప్ప! ' అని! వాడు ఆసంగతే చెప్పాడు తోటి వాళ్లకు.

ఇంకొంత దూరం పోయాక, పంది ఒకటి బురదలో పడి పొర్లుతూ కనబడింది వాళ్లకు. దాన్ని చూడగానే మూడోవాడికి రాజుగారితో తను ఏమి అనబోతున్నాడో తెల్సిపోయింది: తనంటాడు-"ఇంకా రుద్దు! ఇంకా రుద్దు! ఇంకొన్ని నీళ్లతో రుద్దు! నాకంతా తెలుసు బిడ్డా, నువ్వు ఏం చెయ్యబోతున్నావో" అని!

నాలుగో వాడికే, ఇంకా ఏ ఆలోచనా రాలేదు. వాడు ఆ విషయమై విచార పడేంతలోగా వాళ్ళకు నగర పొలిమేరలు కనబడ్డాయి. "నాకు తెల్సింది! రాజుగారికి నేను చెబుతాను-'చిన్న రోడ్లు, పెద్ద పెద్ద రోడ్లు! కొత్వాలుది ఎంత పని! తిరుగు తిరుగు కొత్వాలూ!' అంటాను నేను!" అన్నాడు వాడు.

ఆపైన వాళ్ళు దారిన పోయే దానయ్యనొకడిని దొరకపుచ్చుకొని, ఈ నాలుగు ముక్కలూ రాసి పెట్టమన్నారు. 'రాయనిదే వదిలేట్లు లేరు దేవుడా' అనుకొని, ఆయన తనే ఓ కాగితం తెచ్చుకొని, ఈ నాలుగు వాక్యాలూ రాసిచ్చి చక్కాపోయాడు.

నలుగురు బిచ్చగాళ్ళూ దాన్ని పట్టుకొని నేరుగా రాజుగారి దగ్గరికి పోయారు. కాగితాన్ని ఆయన చేతిలో పెట్టనైతే పెట్టారు కానీ, ఎవరికి

వాళ్ళు తాము ఏమనాలో మర్చిపోయి, ఊరికే నిలబడ్డారు! రాజుగారు ఆ కాగితాన్ని అటూ ఇటూ తిప్పి చూసి, 'ఏం రాసుందో' అని చదివారు. ఎంత చదివినా తలా తోకా లేని ఆ వాక్యాలు ఆయనకు ఏమాత్రమూ అర్థం కాక బిక్కమొఖం వేశాడాయన.

రాజుగారు అట్లా బిత్తరపోవటం చూసి మనవాళ్ళు నలుగురికీ భయం వేసింది- 'రాజుగారు ఆ కాగితాన్ని తమకిచ్చి చదవమంటాడేమో! మనకేమో చదవటం రాదు! మనం ఒకటి చెబితే దానయ్య ఒకటి రాసాడల్లే ఉంది!" అని, నలుగురూ కూడబలుక్కున్నట్లు, అప్పటికప్పుడు పంచెలు ఎగకట్టి, వెనక్కి తిరిగి చూడకుండా బయటికి పరుగు తీశారు. "ఆగండి! ఆగండి!" అని రాజుగారు ఎంత అరిచినా ఆగకుండా వాళ్ళు ఆఘమేఘాలమీద పరుగెత్తిపోయారు, ఎలాగైనా తప్పించుకుంటే చాలుననుకుంటూ.

ఈ రాజుగారికి ఒక దొంగ మంత్రి ఉన్నాడు. రాజుగారికి గడ్డం గీసేందుకు వచ్చే మంగలివాడూ చెడ్డవాడే. సరిగ్గా మన 'సాధువులు' నలుగురూ కాగితాన్ని రాజుగారి చేతికిచ్చి పారిపోయిన రోజునే. మంత్రి మంగలిని కలిసి, వాడిని తనవైపుకు తిప్పుకున్నాడు. "మరునాటి రోజు ఉదయం రాజుగారికి గడ్డం గీసేటప్పుడు, అదే చాకుతో రాజుగారిని చంపెయ్యాలి" అని నిర్ణయించుకున్నారిద్దరూ.



అంతటితో ఆగక, దొంగ మంత్రి వెళ్ళి, ఆ రాజ్యపు కొత్వాలునూ తనవైపుకూ తిప్పుకున్నాడు. "రాజుగారి అంత:పురానికి ఈ రోజే కన్నం వేసి, రాత్రికి రాత్రే అంత:పురంలోని సంపదనంతా కొల్లగొట్టాలి" అని కొత్వాలునూ ప్రేరేపించాడు మంత్రి.

అనుకున్న ప్రకారం ఆరోజు రాత్రి మంత్రీ, కొత్వాలూ ఇద్దరూ రాజుగారి అంత:పురానికి ఉన్న మట్టిగోడకు కన్నం పెట్టటం మొదలెట్టారు.

అయితే వాళ్ళిద్దరూ ఊహించని విధంగా, రాజుగారు లోపలే కూర్చొని ఉన్నారు- మేలుకొని! ఊరికే లేరు; "నలుగురు సాధువులు ఈరోజు ఉదయం నాచేతికి ఇచ్చి పోయిన కాగితంలోని వాక్యాల అర్థం ఏమై ఉంటుంది?" అని ఆలోచిస్తూ, పదే పదే ఆ వాక్యాల్ని గట్టిగా చదువుకుంటూ ఉన్నారు!!

మంత్రీ, కొత్వాలూ గోడను సగం త్రవ్వేసరికి, వాళ్ళకు రాజుగారి గొంతు వినబడ్డది ఉరుముతున్నట్లు- "పందికొక్కులు! చూడు, మట్టిని ఎట్లా త్రవ్విపోస్తున్నాయో! పరపర! కిరకిర!" అని. మరుక్షణం వాళ్ళిద్దరూ త్రవ్వటం ఆపేసి, క్రిందికి నక్కి కూర్చున్నారు అక్కడే.

అంతలోనే రాజుగారు అన్నారు- "లావుపాటి కప్ప! బెక బెక కప్ప! ఎలా దిగబడిందో చూడు! బంక బంక కప్ప!" అని. అది వినగానే మంత్రికి చెమటలు పోసినట్లు అయ్యింది. ఆ మంత్రి పాపం, లావుగా, గుండ్రంగా- కప్పలాగే ఉంటాడు మరి! "అరే, రాజుగారు నన్ను చూసినట్లున్నారు!" అని అతను కొంచెం వెనక్కి తగ్గాడు.

కానీ కొత్వాలు ధైర్యంగా ముందుకు జరిగి, గోడ సందుల్లోంచి లోపలికి నిక్కి చూశాడు. అంతలో రాజు గారు అన్నారు గట్టిగా-"చిన్న చిన్న రోడ్లు! పెద్ద పెద్ద రోడ్లు! కొత్వాలుది ఎంత పని! తిరుగు తిరుగు కొత్వాలూ!" అని. ఇది వినేసరికి కొత్వాలుకు ఉన్న ప్రాణాలు ఊడినట్లైంది. మరుక్షణం కొత్వాలూ, మంత్రీ ఇద్దరూ తాము వచ్చిన పనిని పక్కన పెట్టి, ఒకటే పరుగు తీశారు! "రాజుగారినుండి పిలుపు వస్తుంది, తామిద్దరికీ జైలు జీవితం తప్పదు!" అని వాళ్ళిద్దరికీ బెంగపట్టుకున్నది.

మరునాడు ఉదయం మంగలి రాజుగారి దగ్గరికి వెళ్ళేసరికి, ఆయన ఇంకా ఆ కాగితంలోని రాతల గురించే ఆలోచిస్తున్నారు. రాజుగారి మెడను కోసేసేందుకని మంగలి తన కత్తికి సాన పట్టుకుంటుండగా, గడ్డం పనికి తయారై కూర్చున్న రాజుగారు అరిచారు బిగ్గరగా-"ఇంకా రుద్దు! ఇంకా రుద్దు! ఇంకొన్ని నీళ్లతో రుద్దు! నాకంతా తెలుసు బిడ్డా, నువ్వు ఏం చెయ్యబోతున్నావో" అని. ఒక్క క్షణం నిర్ఘాంతపోయిన మంగలి, రాజుగారికి తన

పథకం మొత్తం తెలిసిపోయిందనుకున్నాడు. "దొంగ మంత్రి పట్టుబడి, నేరం మొత్తాన్నీ నామీదికే నెట్టినట్లుంది" అని వాడికి ఏడుపు వచ్చింది. వెంటనే వాడు రాజుగారి కాళ్లమీద పడి, "నా తప్పేమీ లేదు ప్రభూ! అంతా దొంగ మంత్రి పన్నాగమే!" అని మళ్లీ మళ్ళీ పాడుతున్నట్లు ఏడవటం మొదలుపెట్టాడు. రాజుగారు వాడిని నోరు మూసుకొమ్మని, 'వాడినీ మంత్రినీ బంధించేందుకు సరైనవాళ్ళు ఎవరా' అని ఆలోచించి, కొత్వాలును పిలువనంపారు!

"తనపని ఐపోయింది" అనుకొని వణుక్కుంటూ వచ్చాడు కొత్వాలు. అతను వచ్చేసరికి, మంగలి ఏడుస్తూ కూర్చొని ఉన్నాడు- రాజుగారు అంటున్నారు- కాగితంలోకి చూస్తూ "పందికొక్కులు! చూడు, మట్టిని ఎట్లా త్రవ్విపోస్తున్నాయో! పరపర! కిరకిర!" అని. రాజుగారు నిన్న రాత్రి తాము జరిపిన 'దోపిడీ' గురించే చెబుతున్నారనుకున్నాడు కొత్వాలు. గబుక్కున రాజుగారి కాళ్ళు పట్టేసుకొని, రాత్రి ఏం జరిగిందో సర్వం చెప్పి, తప్పు ఒప్పేసుకున్నాడు.

రాజుగారికి ఇదంతా చాలా కొత్తగా ఉంది. వెళ్ళి చూస్తే, నిజంగానే గోడకు సగానికి పైగా కన్నం వేసి ఉన్నది! వెంటనే ఆయన భటులను పిలిచి, మంగలినీ, మంత్రినీ, కొత్వాలునూ బంధించమన్నాడు. ఆ తర్వాత ఆయన తీరిగ్గా తన చేతిలోని కాగితాన్ని మళ్ళీ మళ్ళీ చదువుకొని మురిసిపోయాడు. తనను కాపాడేందుకే వచ్చిన ఆ "నలుగురు మహాత్ముల్నీ" వెతికి సగౌరవంగా పిలచుకు రమ్మని మనుషులను పురమాయించాడు.

కానీ వాళ్ళెక్కడ దొరుకుతారు? రాజుగారి భయంతో పరుగు పెట్టిన ఆ నలుగురూ ఎంత దూరం పోయారో మరి, ఎవ్వరికీ దొరకలేదు!



# బంగారపు బరువు



*మూలం: ప్రతాప్ అగర్వాల్*

*తెలుగు అనుసరణ: నారాయణ*

ఒక గురువుగారు, శిష్యుడు ఒక బాట వెంబడి నడుస్తూ పోతున్నారు. గురువుగారు ఎందువల్లనో, భయపడుతున్నారు ఈ రోజున. శిష్యుడిని అడిగాడాయన- "దగ్గర్లో గ్రామం ఏదీ ఉన్నట్లు లేదు. కనుచూపు మేరలో నివాసాలేమీ కనబడటం లేదు. మనం సరైన దారిలోనే వెళ్తున్నామంటావా?" అని. ఆయన గొంతులో ఆత్రుత ధ్వనించింది. రెండు నిముషాలకొకసారిఉ ఆయన తన భుజానికి వ్రేలాడుతున్న జోలెలో చెయ్యి పెట్టుకొని చూసుకుంటున్నారు- మళ్లీ మళ్ళీ గొణు-క్కుంటున్నారు- "చాలా ఆలస్యం అవుతున్నది- ఊరు ఏదీ కనబడటం లేదు. మనం దారి తప్పినట్లున్నాం" అంటున్నారు.

గురువుగారు ఏనాడూ ఇట్లా లేరు. శిష్యుడికి ఆయన ప్రవర్తన ఆశ్చర్యం కలిగిస్తున్నది. శిష్యుడికి తెలిసినంతలో గురువుగారు ఎప్పుడూ ఇంత ఆదుర్దా

పడలేదు. "ఇంత ఆతృతకు కారణం ఏమై ఉంటుంది?" అని శిష్యుడు ఆలోచనలో పడ్డాడు.

బాగా సాయంత్రం అయ్యే వేళకు వాళ్ళకొక కొలను కనబడింది. గురువుగారికి స్నానం చేయాల్సిన వేళ అయ్యింది. ఆయన స్నానానికని ఆ కొలనులోకి దిగగానే, ఒడ్డున కూర్చున్న శిష్యుడు గురువుగారి సంచీని తెరిచి చూశాడు.

గురువుగారి సంచీలో మామూలుగా ఉండే బట్టల నడుమ- రెండు బంగారు బిస్కెట్లు కనబడ్డాయి! ఇప్పుడర్థమైంది శిష్యుడికి- గురువుగారు అలా వింతగా ఎందుకు ప్రవర్తిస్తున్నారో- ఇదంతా బంగారపు బరువు!

ఏదో ఆలోచన తట్టి, శిష్యుడు ఆ రెండు బంగారు బిస్కెట్లనూ తీసి అక్కడే ఉన్న ఓ చెట్టు క్రింద మట్టిలో పూడ్చి పెట్టేశాడు. దాదాపుగా అంతే బరువున్న రాళ్ళు రెండింటిని తీసి, సంచీలో వేసి, ఏమీ ఎరగనట్లు మామూలుగా కూర్చున్నాడు.

స్నానం అయిన వెంటనే గురుశిష్యులిద్దరూ కాలి బాట వెంబడి నడక కొనసాగించారు. సూర్యుడు అస్తమిస్తున్నాడు- అయినా దగ్గరలో ఎక్కడ ఊళ్లున్న జాడ లేదు. గురువుగారికి కంగారు హెచ్చింది. ఆయన యధాలాపంగా సంచీలో చెయ్యి పెట్టి, బంగారు బిస్కెట్లను తడిమి చూసుకున్నాడు- అయితే ఇప్పుడు వాటి స్పర్శ ఏదో వేరేగా ఉంది- గబుక్కున వాటిని బయటికి తీసి చూసుకున్నాడాయన- చూస్తే ఏముంది?- బంగారం పోయింది! బంగారు బిస్కెట్ల స్థానే మామూలు రాళ్ళున్నై, రెండు!

మరుక్షణం ఆయన ఆలోచనలు పరిపరి విధాలుగా పోయాయి. అయితే ఆయననే గమనిస్తున్న శిష్యుడు, వెంటనే నిజాయితీగా ఒప్పుకున్నాడు- "మీరు స్నానం చేస్తున్నప్పుడు నేనే- వాటిని తీసి, కొలను గట్టున ఉన్న ఫలానా చెట్టుక్రింద పూడ్చిపెట్టాను" అని. గురువుగారి హృదయం పెద్దది. ఆత్మ విశాలమైనది. ఆయన ఇంకేమీ మాట్లాడలేదు. శిష్యుడిని మరేమీ అడగలేదు.

వాళ్ళిద్దరూ నడక కొనసాగిస్తుండగానే పూర్తిగా చీకటి పడింది. ఆ సమయానికి

వాళ్ళకు ఒక పెద్ద రావి చెట్టు కనబడింది. ఇద్దరూ ఆ చెట్టు క్రింద ఆగి, తమ సామాన్లను ప్రక్కన పెట్టుకున్నారు. నేలను శుభ్రం చేసుకొని పడుకున్నారు. రెండు నిముషాలలో ఇద్దరూ గాఢ నిద్రలోకి జారుకున్నారు!

వాళ్లిద్దరూ ఇంకా ఏకాకులే; నిర్జన అటవీ ప్రదేశంలోనే ఉన్నారు; దగ్గర్లో మనుషులున్న జాడలేవీ లేవు- కానీ బంగారం పోయిన తరువాత, గురువుగారి హృదయం నుండి భయం మాయమైంది విచిత్రంగా. "భద్రత కోసం ఒక ఇల్లూ, ఊరూ ఉండాలి" అన్న అవసరం ఆయనకిక లేకుండా పోయింది.

సంచీలో ఉండిన బంగారమే కద, అసలు భయం!

జోకు

**దెబ్బకు దెబ్బ!**

హెల్లో..!?

హెల్లో..చెప్పండి?

హెల్లో, రామారావేనా?

అవును రామారావునే, చెప్పండి.

మీ గొంతు రామారావు లాగా లేదే?

నేను రామారావునే, మాట్లాడుతున్నాను చెప్పండి!

నిజంగా మీరు రామారావే కదా?

అవునండీ, నేను రామారావునే మాట్లాడుతున్నాను.

ఏమీ లేదు, నేను అప్పారావుని- ఓ వెయ్యి రూపాయలు అప్పిస్తారేమోనని, ఫోన్ చేశా.

హెల్లో.. నేను చెప్పిఉంచుతాను లెండి, రామారావు రాగానే మీకు ఫోన్ చేస్తాడు.

ఆ...?!

# ప్రకృతి ఒడిలో పువ్వులం

పాట

*A.S.గీతిక, C.కృష్ణవేణి, C.భవ్య, ఏడవ తరగతి, టింబక్టు బడి, చెన్నేకొత్తపల్లి.*
*సేకరణ, స్వరకల్పన: బసవరాజు, కర్నూలు.*
*(సాహిత్యంలో తప్పులు దొర్లినట్లున్నై.. మూలం లభించనందువల్ల, దొరికినవాటిని దొరికినట్లు ప్రచురిస్తున్నాం.. విజ్ఞులు సవరించగలరు.)*



ప్రకృతి ఒడిలో పిల్లలం
స్వేచ్ఛగ ఎగిరే గువ్వలం
కల్లలు ఎల్లలు లేని పిల్లలం
పంజరమందున రామచిలుకలం
"ప్రకృతి ఒడిలో పిల్లలం"
ఝుమ్మని సాగే తుమ్మెద నాదం..ఝుంఝుం...
సీతాకోక చిలుకల అందం
చేతికి అందిన పరమానందం
పెనవేసుకుపోయే మా బంధం
"ప్రకృతి ఒడిలో పిల్లలం"



జొన్నదంటులూ ఏరుకు వస్తాం
ఈనెలు బెండుతొ బండులు చేస్తాం
బంకమట్టినీ మర్దన చేస్తాం
ఎద్దులు చేసీ బండికి కడతాం
"ప్రకృతి ఒడిలో పిల్లలం"

పక్షుల గొంతుతో వంత పలుకుతాం
పిల్లకోతులై చెట్లు ప్రాకుతాం
బస్సు-రైలుగ పరుగులు పెడతాం
గాలి పటాలై నింగిని తాకుతాం
"ప్రకృతి ఒడిలో పిల్లలం"

ఆడుతు పాడుతు చదివేవాళ్ళం
ఆలోచనలతో ఎదిగే హృదయం
ర్యాంకులబాణం చేసెను గాయం (?)
అయ్యెను విద్య వ్యాపార మయం (?)
"ప్రకృతి ఒడిలో పిల్లలం"

ఆటపాటలలో ఉన్నది జ్ఞానం
ఒత్తిడి పెంచితె రాదు విజ్ఞానం
చదవలేదా నాడు ఎందరొ చదువులు?
కాలేదా, శాస్త్రజ్ఞులు-గురువులు?
"ప్రకృతి ఒడిలో పిల్లలం"

జోకులు

**ఎక్కడున్నానో తెలీదు!**

కారు డ్రైవర్: సార్, పోలీస్ స్టేషనేనా? మాకారు గేర్ బాక్సును ఎవరో దొంగిలించారు సార్!

పోలీసు: సరే, మీపేరు, వివరాలు ఇవ్వండి.

కారు డ్రైవరు (కొంతసేపటికి): సార్! గేర్ బాక్సు కనబడింది సార్, మీరు రానక్కర్లేదు.

పోలీసు: దొంగెవరో దొరికాడా?

కారు డ్రైవరు: దాన్ని అసలు ఎవ్వరూ ఎత్తుకు పోలేదు సార్! నేను ఇంతసేపూ మా కారు వెనక సీట్లో కూర్చొని గేరు బాక్సు కోసం వెతుక్కున్నాను, అంతే.

**తగ్గింపు తెలివి!**

అంగడి ఓనరు: మా దుకాణంలో ఏవి కొన్నా ఒక రూపాయి తగ్గింపు ఇస్తాం.

రవి: అయితే నాకు ఒక రూపాయి చాక్లెట్లు ఇవ్వండి, ప్లీజ్!

**విండోస్!**

టీచరు: చందూ, విండోస్ ఏ కంపెనీ సొంతమో చెప్పు, చూద్దాం?

చందు: అన్ని కంపెనీల్లోనూ విండోస్ ఉంటాయి గద టీచర్! మా ఇంట్లో కూడా ఉంటాయి!

# అమ్మకొడుకులందరూ

*సేకరణ, స్వరకల్పన: రాందాసు, అనంతపురం*
*గానం: T.ఓంలత, K.భార్గవి,C.కృష్ణవేణి, A.S.గీతిక, C.భవ్య, ఏడవతరగతి, టింబక్టు బడి.*





అమ్మకొడుకులందరూ అన్నదమ్ములే
ఆ పిల్లల నవ్వులన్ని అమ్మ సొమ్ములే
పుట్టిన ప్రతివాడికీ దేశమే అమ్మరా
పరాయివాడు వాడు అంటూ ఎవ్వరూ అనరాదురా
"అమ్మ కొడుకులందరూ అన్నదమ్ములే"

హిందువులు, ముస్లింలు, క్రైస్తవులని విభజన
నమ్మకాలలోగాని అమ్మ కాడ కాదురా
పాల కొరకు పొదుగు కోస్తే రక్తమొచ్చురా
రెచ్చగొట్టి చిచ్చు పెడితే మతం చచ్చురా.
"అమ్మ కొడుకులందరూ అన్నదమ్ములే"

ఇరుగు పొరుగు కలిసుంటాం
బాబాయ్ పిన్నీ అంటాం
రంజానూ దీపావళి అందరి పండుగలంటాం
అనుమానపు చూపుతో అనుక్షణం గండమే

**కొత్తపల్లి సెప్టెంబరు 2010**

మతమారణహోమంలో దేశం సుడిగుండమే
"అమ్మ కొడుకులందరూ అన్నదమ్ములే"

కార్మికులూ కర్షకులూ ఉద్యోగులు సైనికులు
ఇంజనీర్లు డాక్టర్లు శాస్త్రజ్ఞులు మేధావులు
మతాల మర్మం వద్దని మానవ ధర్మమే ముద్దని
తమ రక్తం ధారపోసి జీవనదులు చేశారు.
"అమ్మ కొడుకులందరూ అన్నదమ్ములే"

చరిత్రలో ఏమైందో ఏ రాజేం చేశాడో
తోడబుట్టినోళ్ళను కారకులుగ చూడచ్చా?
మసీదు-చర్చ్‌ల్ని కూల్చి ఖురాన్ బైబిల్ని కాల్చే
మతోన్మాదులార మిమ్ము మనుషులుగా చూడచ్చా?
"అమ్మ కొడుకులందరూ అన్నదమ్ములే"

ఈ సంచికలోని పాటల్ని మీరు ఇంటర్నెట్‌లో
http://kottapalli.in/2010/09 వద్ద నేరుగా వినచ్చు!

# నెమలీ-నెమలీ!

పాట

*రచన: శ్రీ. వారణాసి వెంకట్రావు, విజయవాడ.*

*గానం: సరిగమ, 9 వ తరగతి, విద్యార్థి సృజన కుటీర్, విజయవాడ.*

నెమలీ నెమలీ నాట్యమాడవే,
ఒంపు సొంపుల వయ్యారాలతో(2)

ఉరుముల గంటలు మెడలో కట్టుకు
పరుగిడు ఆ... మబ్బులే(2)
మెరుపుల కన్నులు తెరచుకొని(2)
నిలిచెను ఒకపరి నిన్ను చూడగా
"నెమలీ నెమలీ"




ఎండకు వానకు వెలియని నలుగని
రంగు పూల పురి పట్టు పావడా(2)
సింగారించుకు సరినాకెవరని(2)
అడుగులు వేసే అందాల రాశి
" నెమలీ నెమలీ"

నటరాజు ఇంటనే నాట్యం నేర్చి
ఇలకరుదెంచిన ఇంద్రనీలమా(2)
హరివిల్లులతో ఆకాశం (2)
వేదిక వేసెను నీకోసం
"నెమలీ నెమలీ"

# వానాకాలం వచ్చింది!

పాట

*రచన: శ్రీ.వారణాసి వెంకట్రావు, విజయవాడ.*

*గానం: అఖిల, కీర్తన, సరిగమ, 9 వ తరగతి, విద్యార్థి సృజన కుటీర్, విజయవాడ.*

వానకాలం వచ్చింది,

నింగీ-నేల పులకించాయి(3)

"వానకాలం వచ్చింది "

ఆకాశంలో అక్కడక్కడ

అందమైన హరివిల్లులు విరిసె(2)

నేలయంతటను అప్పుడప్పుడు

ముత్యాల తొలకరి జల్లులు కురిసె(2)

"వానకాలం వచ్చింది"




ఉరుముతు మెరుపుల కన్నులు తెరచి

నింగే నిద్దుర లేచింది(2)

పచ్చిక బయ్యళ్ళు, పారే ఏరుల

నేలే నూతన రూపం దాల్చె(2)

"వానకాలం వచ్చింది"

# టీ!

**బొమ్మకు కథ రాయండి!**

*నిర్వహణ: G.లలిత, telugu4kids.com*

ఇక్కడ ఇచ్చిన బొమ్మను చూడండి. ఈ బొమ్మను చూస్తే మీకు ఏమనిపిస్తున్నది?


Chinese Mural Painting by **Peter Griffin**

ఘుమ ఘుమ లాడే టీ, శాస్త్ర గ్రంథాలను పట్టుకున్న అధికారీ, ఎదురుగా నిలబడ్డ మనుషులు... ఏదో కథ రాయాలని అనిపిస్తున్నది కదూ? ఆలస్యం ఎందుకు? రాసి పంపండి మాకు. కథ బాగుంటే కొత్తపల్లి పత్రిక **నవంబరు సంచిక**లో ప్రచురిస్తాం.

మా చిరునామా: కొత్తపల్లి బృందం, 2-312, న్యామద్దల రోడ్డు,
చెన్నేకొత్తపల్లి (మం)(పో)- 515 101
అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్.

## కొత్తపల్లి బృందం





## చందా వివరాలు

**సంవత్సర చందా:** 200/ రూ.

చందాను 'కొత్తపల్లి ట్రస్టు' పేరిట మనీఆర్డర్ లేదా డి.డి లేదా చెక్కు రూపంలో కట్టవచ్చును. డి.డి., చెక్కులకు బ్యాంకు చార్జీలు (25రూ) కలపాలని మనవి.

**చందాలకై చిరునామా:**

కొత్తపల్లి ట్రస్టు,
2-312, న్యామద్దల రోడ్డు, చెన్నేకొత్తపల్లి,
అనంతపురంజిల్లా, 515101.

**బ్యాంకు ద్వారా చందా కట్టడానికి వివరాలు:**

KOTTAPALLI TRUST,
A/c No:0138101018809 (Savings Type),
CANARA BANK, Chennekottapalli,
Anantapur District, A.P.
IFSC code: CNRB0000138.

డబ్బు కట్టిన వివరాలను ఇమెయిలు/ ఫోను/ ఉత్తరం ద్వారా కొత్తపల్లికి తెలియపరచగలరు.

ఇమెయిలు: team@kottapalli.in

ఫోను: 08559 240222.

**కృతజ్ఞతలు:**

పత్రికకోసం నిరంతరంగా పిల్లల రచనల్ని అందించి సహకరిస్తున్న ప్రకృతిబడి, టింబక్టు బడి, విజ్ఞం స్కూల్ యాజమాన్యాలకు కృతజ్ఞతలు. వెబ్ సైటుకు వెన్నుదన్నుగా నిల్చిన infogami యాజమాన్యానికి, దాన్ని సుసాధ్యం చేసిన python భాషకు, చక్కని ఆపరేటింగ్ సిస్టం linux ను అందించిన ubuntu వారికి, గొప్ప వ్యవస్థని పూర్తిగా ఉచితంగా అందిస్తున్న OpenOffice వారికి, తెలుగును రప్పిస్తున్న Unicode, Scim, Baraha లకు, చిత్రాలను సరిదిద్దే Software Gimp నిర్మాతలకు, శబ్దాలను చక్కబరచే Software Audacity నిర్మాతలకు కృతజ్ఞతలు.

మంచి పుస్తకం:

# చిన్నారి నేస్తం

(Little Prince)



...నాకూ ఒక బొమ్మ గీయాలని సరదా పుట్టింది. ఓ కాగితం, రంగు పెన్సిల్ తీసుకొని, కాసేపు కష్టపడి బొమ్మ గీశాను. ఆ బొమ్మను పెద్ద వాళ్లకు చూపి, "దీన్ని చూస్తే మీకు భయమేస్తోందా, లేదా?" అని అడిగాను. వాళ్ళు నవ్వేసి, భయమెందుకు? టోపీని చూసి ఎవరైనా భయపడతారా?" అన్నారు.

నేను గీసిన బొమ్మ అసలు టోపీ కానే కాదు...

* * *



..."మనుషులు ఎక్స్‌ప్రెస్సు రైళ్లలో వేగంగా ఎక్కడికో వెళతారు. దేనికోసం వెతుకుతున్నారో వారికి తెలియదు. అయినా తొందర పడుతూనే ఉంటారు. ఆందోళన పడతారు. ఒకే గిరి చుట్టూ తిరుగుతారు. అంత కష్టపడినా, చివరికి సాధించేదేమీ ఉండదు" అన్నాడు చిన్నారి నేస్తం.

.....ఆ బావి మాత్రం గ్రామాల్లో ఉండే బావుల్లాగే ఉంది, కానీ దగ్గర్లో గ్రామమేదీ లేదు. దాన్ని బట్టి నేను కలగంటున్నానేమో అనుకున్నాను.

"వింతగా ఉందే! గిలక, బకెట్, తాడు అన్నీ మనం ఉపయోగించటానికే అన్నట్టున్నాయి" అన్నాను.

చిన్నారి నేస్తం నవ్వి, తాడు పట్టుకొని గిలకపైనుంచి బకెట్‌ను నూతిలో వేశాడు. గిలక కిర్రుమని చప్పుడు చేసింది. "విన్నావా? మనం బావిని నిద్రలేపాం. అది పాడుతోంది" అన్నాడు...

పుస్తకాన్ని చదవాలనిపిస్తోంది కదూ? నిజంగా అందరూ చదవాల్సిన పుస్తకం! తొందరగా సంపాదించండి మరి!!




**చిన్నారి నేస్తం**

(Little Prince)

ప్రచురణ: బాల సాహితి, 1991

83 పేజీలు- వెల 12 రూ.

